శ్రీరస్తు.

శ్రీ

# హనుమద్విజయము

అను

## మైరావణ

(9 అంకముల నాటకము.)

ఇది

మేళ్లచెర్వు కుటుంబరాయ శర్మచే

రచియింపఁబడి

"రోషనార" గ్రంథకర్తయగు

బ్రహ్మశ్రీ కొప్పరపు సుబ్బారావుగారిచే

సరిచూడఁబడి.




చిమకుర్తి రామకోటయ్య శాస్త్రిగారి ద్రవ్యసహాయముచే

మొదటికూర్పు

ప్రత్తిపాటి శేషయ్య అండు సన్సువారి

రాజ్యరమాముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడి

గ్రంథకర్తచే బ్రకటింపఁబడియె.

1925

 వెల రు. 1.

# విజ్ఞప్తి

పాఠక మహాశయులారా :—

షుమారు రెండు మూడు సంవత్సరముల క్రిందట మద్మిత్రుండగు శ్రీయుత వెల్లముకొండ నరసింహారావు గారు, నేను వీధినాటకముఁ జూచుచుండుటవలన నేగువాఁడకది వీధినాటకము గాక చర్మనాటకమే (బొమ్మలాట) కథ నే వాడుచుండెఁ గథాభాగముఁ గొంతవరకుఁ గని వెంటనే దానిని నాటకముగా వ్రాయుమని కోరినంత "ఆర్యా! ఇదివఱకిట్టి బాధ నొందితిని. లాభము లేదయ్యె ఇప్పుడు మాత్ర మేమి లాభ"మని నే నసుగుకొనఁగా "లేదు లేదీపర్యాయము వ్రాసిన వెంటనే దప్పకఁ బ్రదర్శింపఁజేతు"నని నాగ్రహ మొనరించి నన్నప్పటినుండియుఁ బ్రోత్సాహము లలవంత పెట్టుచు వచ్చినందున "నేనైనఁగాని"మ్మని గ్రంథరచనకు మొదలిడి పక్షము గడచులలోఁ బూర్తిగాఁ గావించి యొసంగ మిత్రుండును డెక్కన్ సంఘ సోదరులును నా హృదయ చేతగాని ప్రధాననటుఁడగు నరసింహారావు గారి పట్టుదలనుఁ జూచిగాని స్వల్పకాలములోఁ బ్రదర్శించి నాకుఁ బ్రోత్సాహకులైరి. తదుపరి నా ప్రయత్నమక్కఱ లేకయే మఱల మఱలఁ బ్రదర్శింపుచు వచ్చిరి. ఆ ప్రదర్శనమప్పుడు ప్రేక్షకుండుగా నుండిన శ్రీయుత చీమకుర్తి రామకోటయ్య శాస్త్రిగారు తనకీ గ్రంథము నంకితమొసంగఁగోరిరి. కాని సమాజకులు మాత్రము కొంతకాలము ముద్రింపించక స్వాతంత్ర్యముగా నే యుంచఁగోరినందున వారిమాటలఁ ద్రోసివేయలేక రామకోటయ్యగారికే జవాబుఁ జెప్పఁగాలముఁ గడిపితి. ఇటీవల నాటకశాలాధిపులగుటయు సాంఘికులు దాని పునర్నాట్యప్రయత్నములలో నుండుటయుఁ దెలిసి నాటకప్రదర్శనము లేమానిరి. ఇంతలో శ్రీయుత నరసింహారావుగారు సమాజకులను, తల్లిదండ్రులను, భార్యను, సోదర సోదరీమణులను, దీననిదుఃఖాంబుధిలో ముంచి వారాత్తుగా నకాలమృత్యువాతఁబడి నిరంతర స్వర్గలోక సౌఖ్యములఁ బడయ నరిగిరి. ఆవార్త్తఁ దలంచుకొనిన నెట్టికఠినహృదయుడైనఁ గన్నీరు గార్చక మానఁడు. తదుపరి శ్రీనరసింహముగారి యంతముతో నే నా యభిమానము వీడెనో యనునట్లు సమాజకులు నా గ్రంథప్రస్తావన మఱచియుండుటచేతను సుకృతిభగ్నబలవంతమధికమగుటచే నేటికా పుణ్యశీలుని యిష్టానుసారముగ ముద్రింపించి పండితమండలి పాదంబుల చెంతఁ గానుకవేయ సాహసించితి.

గ్రంథరచనకుఁ గావలసిన మూలాధారము లేమియు నాకుఁ జిక్కలేదు. కొందఱితో నాలోచింపఁ గిది కల్పితమనియు నమ్మఁదగినది కాదనియుఁ జెప్పిరి గాని కొందఱిది ఋషిప్రోక్తమనియు దూర్వాస రామాయణమునందీకథాభాగము గన్పట్టుననియుఁ బూ

ద్యమాంధ్రకవులలో నొకరీచరిత్రమును ప్రబంధముగా రచించియున్నారనియుఁ గూడ చెప్పిరి. కాని గగనకుసుమములభాతి నాకాగ్రంథము లేమియుఁ జిక్కకుండుటచే నీ జిల్లాలో సుప్రసిద్ధులుగా నాడుచుండిన చర్మనాటకుల యాధారముననే దుదకీగ్రంథమును వ్రాసితిని. ఇదినిజమైనను, కాకపోయినను శ్రీరామచంద్రుని పావనచరిత్రలోని భాగమగుట నిరసింపఁదగినది మాత్రము కాదు.

ఇఁక నాశక్తి మీ కెఱుంగనిది గాదు. నాప్రయత్నమునకిది ప్రథమము గాకపోయినప్పటికి "నెప్పటికాలేక్రియే" యను మెఱుటు సామెత నాయెడఁ దప్పక సార్థకపడుచున్నది. భాషావధూటి షోడశకళలతో దినదినాభివృద్ధినొందుచు సంతతసంతోషిత స్వాంతయైయుండినను నాబోటి యల్పజ్ఞానికలమునకందుఁ జిక్కుచుఁ గొంతవిచారముందుచునేయున్నదని చెప్పకఁ దప్పదు. మనుజునకాత్మసంతోషమే సంతోషముగాని పరులదుఃఖములనుఁ బాటింపకుండుట విధాయకంబేయగుటనే నామార్గమేననుసరించి విద్యాప్రశక్తి లేశమైనను లేకఁ గేవలనాటక సాంఘిత్వముచేఁబడసినస్వల్పజ్ఞానముననే విఱ్ఱవీగుచుంటి. కాని నావంటివాఁడొకఁడుండఁదకొండిన పండితశబ్దోత్పత్తియే యనవసరమైయుండును. దీనియందుఁదప్పులుకుప్పలుగానుండుననుటకు సందియము లేదు. కానిసదయహృదయులరగుమీకు దోసిలియొగ్గుచుంటిని. నారచనాకౌశలము నేమాత్రముఁ బాటింపకఁ గథాభాగమైనసరసినిరసింపకుందురని ప్రార్థించుచున్నాఁడ. కాకనీస్వబుద్ధియే ప్రధానముగా నెంచి నన్ను నిందింపమొదలిడి నరువగా గొంతుఁగోయఁ దలంతురేని మిమ్మేమనఁజాల. అట్టికీర్తి మిమ్మేవరించుఁగాక! పుత్రవాత్సల్యమున నిష్కపటభావముతో నాకుఁదెలియఁబఱచిన నామార్గమనుసరించి వృద్ధికాముఁడనయ్యెద. దీనిని సాధ్యమైనంతవఱకుఁ బరిశీలించి తప్పులెనవరించి ముద్రణానుకూలముగ జేసిన శేషనారగ్రంథకర్తలగు బ్రహ్మశ్రీ కొప్పరపు సుబ్బారావుగారికి వందనములాచరించుచున్నాఁడ. అసలేయల్పజ్ఞానమందుదరిద్రుఁడనగుట నుదరపోషణకై తిప్పలఁ బడు గందరగోళములో ప్రూఫులదిద్దుకొనుటలోఁగూడా పరుషసరళ, రేఫఱకార యర్ధానుస్వారలపొరపాటులనేకములు కలిగియున్నవి. వాటినిఁగూడ చదువరులుదారభావముతో మన్నింపవేడుచున్నాను.

నర్సారావుపేట
2—12—25.

ఇట్లు విధేయుఁడు,
మేళ్లచెర్వు కుటుంబరాయశర్మ.

# అంకితము.



రఘురాముపాద సర
సీరుహసంతతభక్తిమార్గ సం
చారుఁడు, **చీమకుర్తి** కుల
సాగరచంద్రుఁడు దారకీర్తి వి
స్తారుఁడు, **రామకోటయ** వ
దాన్యునకీకృతి నిచ్చితిన్ శుభ
శ్రీరమణీయమై యశముఁ
బొందఁగ ధారుణి సర్వకాలమున్॥

గ్రంథకర్త.

శ్రీరస్తు. శుభమస్తు.

# కృతిపతివంశానుక్రమణిక.

శా॥ శ్రీవైకుంఠుని వక్షకౌస్తుభమణిన్ • జెల్వొందుచుం బేర్మినాల్
భావంబందు సపత్నులబ్బెనని కో • పంబూనుల క్ష్మాసతిన్
దాపేక్షించి హసించు శ్రీహరికృపా • త్మన్ "జీనుకుర్త్యా"ఖ్య వం
శావిర్భూతుని "రామకోటయ"నువా • త్సల్యంబునన్ బ్రోవుతన్॥

సీ॥ నిరతంబు శ్రీహరి • చరణాబ్జసేవన, పారీణచిత్తుల • భక్తులెవరు?
భూసురవరపద • దాస్యపరిచర్యా ప్ర, సద్వ్రతాచరణాగ్ర • చారులెవరు?
దానధర్మాది స • త్కార్య పరిభ్రాజ, సదమలకీర్తివి • స్తారులెవరు?
సతతదీనజనరక్ష • ణాప్రదానామోఘ, సదయానుకూలస్వ • హృదయులెవరు
వారుమిథునకులగోత్రి సం • భవులు వైశ్య
శ్రేష్ఠులవ్వారిలోపలన్ • జీమకుర్తి
వంగడంబొండువెలసెను • వసుధలోన
మహిత విద్వజ్జనస్తోత్ర • మాన్యముగను॥

శా॥ ఆవంశంబున నుద్భవించెఁగరుణా • యత్తైకచిత్తుండు స
ద్దేవబ్రాహ్మణభక్తితత్పరుఁడు దీ • నాలోకకల్పామిత
శ్రీవైభోగయుతుండుదారుఁడు శుభ • శ్రీమించగా సత్యదీ
క్షావాప్తిప్రతిభన్ నృసింహుఁడు సదా • చారప్రశస్తుండనన్॥

ఉ॥ ఆతఁడు పున్నమాంబయను • నంగనఁ బెండిలియాడి యామెయం
దాతతభక్తిమార్గచరు • లైతగుసుబ్బయలక్ష్మయాఖ్యులన్
బ్రీతినొసంగు పుత్రులను • వేడుకఁ గోటమయన్ గుమారికన్
ప్రీతి సమస్తదోషులఁ బ • వితృలఁగాంచె ముదావహంబుగన్॥

ఉ॥ చూడఁగనందు జ్యేష్ఠుఁడగు • సుబ్బయశ్రేష్ఠి జనానుకూలుఁడై
వీడక సత్యమార్గమును • బీదలసాదలభేదబుద్ధితోఁ

జూడక సాధుహర్షణీయ ♦ సుందనంగాఁ జెలువొందియెంతయో
పోడిమిమీర సర్వనుత ♦ ప్రోజ్జ్వలుఁడై వెలుఁగొందె మేలనన్॥

గీ॥ అతఁడు సూరెకులగోత్రుఁ ♦ డమలవిభవుఁ
డైన కూష్మాండవంశ ము ♦ గ్ధాంబురాశి
శీతకరు రామలింగాఖ్య ♦ ఖ్యాతచరితు
తనయ రామాంబ హస్తపీ ♦ డనమొనర్చె॥

గీ॥ అంత నరసింహ, పెదకోట ♦ య్యలను రామ
కోటి, రామయ్య యనెడు స ♦ ద్గుణుల బెద్ద,
చిన్న, బుల్లి వేదాద్రులన్ ♦ వన్నెమీఱు
సుతుల, వెంకమాంబకియను ♦ సుతనుగాంచె॥

ఉ॥ శ్రీరమణీయమూర్తులని ♦ చెన్నలరారిన వారికీర్తి బెం
పారఁగ వేయి చెప్పవలె ♦ నా? యది చర్వితచర్వణంబగున్
సారయశో విశారదులు ♦ సాధుజనావనధుర్యులైన య
వ్వారల నామముల్ వినని ♦ వారలిలన్ వెలియంచెలుంగుచున్॥

ఉ॥ దానమునందు కర్ణుఁడు ని ♦ దానమునందు యుధిష్ఠిరుండు వి
ద్యానయసద్గుణంబుల మ ♦ హాత్ముఁడు గీష్పతి సత్యమార్గసం
ధానమునన్ ద్రిశంకు వర ♦ నందనుఁడా మహేంద్రియపుత్రుఁడుగాఁ
త్తో నిరతాన్నదాతయగు ♦ యుజ్జ్వలకీర్తిఁ బెలంగె ధారుణిన్॥

క॥ ఆ రామకోటి సదయుఁడు
భూరియశుం డొటూకూరి ♦ పుల్లయసుత సౌ
నారీమణి హనుమాంబనుఁ
గోరి మనోజ్ఞఁ బెండ్లియాడెఁ ♦ గుణగణనీయన్॥

ఉ॥ ఆహనుమాంబయున్ సతియు ♦ హర్నిశమున్ బనిపాటలందు నే
యూహలఁ బోవనిచ్చుచు మ ♦ హార్ధతదీనుల బిడ్డలో యనన్
దోహతలంపులేక కను, ♦ మందుడుకన్న నెలుంగ దెందు; సం
దేహము లేక భర్తృపద ♦ నీరజయుగ్మముఁ గొల్చుభక్తి చేన్॥

చ॥ సరసుఁడితండటంచు బుధ • సత్తములెల్లరుఁ దన్ను మెచ్చ శ్రీ
కరుఁడగు, నిత్యభోగములఁ • గాంచుచు సర్వసుఖప్రపూర్ణుఁడై
స్థిరతర నిత్యసత్య నియ • తిన్ జవదాటక కీర్తిధాముఁడై
వఱలెడి రామకోటయ ప్రి • వర్తనవర్ణనఁ జేయశక్యమే!

చ॥ పరహితకార్యతత్పరతఁ • బండితసన్నుతి పాత్రుఁడౌచుఁ దా
నిరతము దానధర్మముల • నిర్మలచిత్తముతోడ సల్పియా
దరమున బీదసాదలనుఁ • దన్పుచు శక్తికొలంది ప్రీతి శ్రీ
హరిచరణాబ్జ భృంగమగు • నాతనికన్యులు పోలనేర్తురే॥

గీ॥ పూజ్యచరితుండు పండిత • పోషకుండు
ధర్మనిరతుండు నిజవర్ణ • ధర్మపరుఁడు
నైన శ్రీరామకోటీశ్వ • రార్యు నోము
నఖిల శుభములనిడుచు నా • రాయణుండు॥

మంగళం

# ఈనాటకమునందువచ్చు ముఖ్యపాత్రలు.

## పురుషులు.

సూత్రధారుఁడు. } (ప్రస్తావన)
మారిషుఁడు. }

| | |
|---|---|
| రావణుఁడు. | అం. 1. |
| ద్విజిహ్వుఁడు. | ,, 1. |
| రాముఁడు. | ,, 2, 9 |
| లక్ష్మణుఁడు. | ,, 2, 9 |
| సుగ్రీవుఁడు. | ,, 2, 3, 5, 9 |
| అంగదుఁడు: | ,, 2, 3, 5, 9 |
| హనుమంతుఁడు. | ,, 2, 3, 5, 6, 7, 8, 9 |
| జాంబవంతుఁడు. | ,, 2, 3, 5, 9 |
| విభీషణుఁడు | ,, 2, 3, 5, 9 |
| సూటికుఁడు. | ,, 3 |
| శుచిర్ముఖుఁడు. | ,, 3 |
| మైరావణుఁడు. | ,, 1, 4, 5, 7, 8 |
| మత్స్యవల్లభుఁడు. | ,, 6, 8 |
| విదూషకుఁడు. | ,, 4 |

## స్త్రీలు.

| | |
|---|---|
| మండోదరి. | అం. 1 |
| మతంగి. | ,, 4 |
| దోర్దండి. | ,, 7, 8 |
| చెలులు. 2 | ,, 4 |
| దాసి. | ,, 7 |

ముద్రికాకుంభోద్వహనాటక ప్రదర్శనమున ముఖ్యపాత్రలం

గైకొనిన నర్సారావుపేట విక్టోరియామెమోరియల్

నాటకసంఘముయొక్క ప్రసిద్ధనటకులు.

సూత్రధారుడు :— V. Sreeramulu Pantulu garu B. A. L. T.

మారిషుడు:— V. Seshachelam garu, Land Lord,

రావణుడు:— V. Lakshminarasimham garu Land Lord.

ప్రాడ్వివాక్యుడు:— M. Peda Punnaiah garu Pleader's clerk.

సైంధవుడు — B. Lakshminarasimha Rao garu Amina Dt Munsiff's' Court

రాముడు:— B. Subba Rao garu B, A. Vakil.

లక్ష్మణుడు:— R. L. Narsimha Rao garu, Land Lord. & Typist Rev Divisional Office.

సుగ్రీవుడు: — N Janikiramayya garu Land Lord.

అంగదుడు:— S V. Ramanayya garu, clerk, Municipal Office.

హనుమంతుడు:— Ch Dasaradhi Rao garu, Land Lord & Clerk Dt. Munsif's Court.

విభీషణుడు· — P. V. Subbaiah garu, School Master.

ఘటోత్కచుడు:— Y. Hanumantha Rao naidu garu Land Lord & Photographer.

శుచిరత్రముఖుడు:— P. R. Kristnayya garu Photographer

విమానకుడు: — B. Babusingh garu. Hd Clerk Taluk Board Office.

మతంగి· — B Narasimha Rao garu.

కొర్గండి· — P Hanumantha Rao garu.

———— o. ————

అహా! శూర్పణఖబోధలు నన్నిట్టిపాటునకుఁ దెచ్చినవి. నాసోదరి నాకీసారసాక్షీవృత్తాంతంబుఁ జెప్పకున్న నాకు మరులుగలుగకుండునుగదా. అప్పుడింత రాదుగదా! ఇంతకును "బుద్ధిఃకర్మానుసారిణీ" యనుమాటకైవడి కర్మననుసరించి బుద్ధులువొడసూపుచుండుట నిక్కము. లేకున్న

సీ॥ ఏకపత్నీవ్రతం ♦ బెసఁగురామునిఁ దావ
రించిసిగ్గేదియా ♦ చించనేల?
యాచించెఁబో? దాని ♦ యజ్ఞానమునుకోక
ముక్కుసెవులఁబట్టి ♦ చెక్కనేల?
చెక్కినంత నెలుఁగెత్తి ♦ చేఁజిక్కిసోదరి
కుటిలబోధన నాకుఁ ♦ గూర్పనేల?
కూర్చెఁబో! కాదన ♦ కుండఁగా మరుబారిఁ
జిక్కిసీతను చెరఁ ♦ జేర్పనేల?
చేర్పనేమాయె? వలపంచుఁ ♦ జెప్పువారి
హితము నెంచకఁ గ్రూరత ♦ నెగిరిపడుచు
పంతమూనితిఁ గులమెల్ల ♦ పాడువడఁగ
భంగపడితిని తుదకొంజ ♦ దొంగనైతి॥

అక్కటా! కాలమహిమలో నింతగా మారిపోయినది,

గీ॥ సకలసౌభాగ్యలక్షణ ♦ స్థానమైన
ఏక్షణమున పెనువల్ల ♦ కాడుగాఁగ
"నా"యనెడువారలెల్లరు ♦ మాయమైరి
యడలవలసెను నిస్సహా ♦ యతనుసకట॥

ద్వా. ప —— దేవా! రమకిది యేటి వెఱ్ఱి? సంగ్రామంబున నరివీరులచే దెబ్బతినకుండ నెంతటివీరునకైన జయము చేకూరఁగలదా! సంగరము వరక్తప్రసాదితరంగమేగదా. అట్టిరంగంబున నడయాడుచు నొక్కచో నెట్టులో గలిగినభంగపాటునకు బెంగఁగొనుట వీరపురుషులకు లక్షణమా? పోయినవారు పోయినను మిగిలినవారు

రేరా! అందఱిమాటలేల? మీఱొక్కరుచాలరా సకలలోకక్షయంబొనరించుటకు? అట్టిమీరే ధైర్యమునువిడనాడిన ముందుజరుగఁదగు కార్యములెట్లు సమకూడఁగలవు? కావున ధైర్యముఁ దెచ్చుకొని తగువీరులఁ దోడుకొని యీ మానవాధముని మట్టుఁబెట్టునుపాయమాలోచించుఁడు. ఇంతకేమించినట్లుతల పంచుకొనఁబాడియగునా!

రావ— ఓయి వెఱ్ఱివాఁడా! ఇంకను మించవలయునా? ఇంతకు మించవలసినదినాయంత ముక్కటియేగదా.

చ॥ సుతులునశించినారు రణ • శూరులుమంత్రులుచచ్చినారు స్నే
హితులుగతించినారు: కద • నేచ్ఛఁజరించెడు వీరవర్గముల్
ధృతినిఁదొలంగినారుకడు • ధీరపదాతులు బాంధవోత్తముల్
హతులయినారిఁకేమిగని • యక్కట! ధైర్యముఁగాంతు చెప్పవా॥

ఇట్టియుత్పాతంబు కలుగుననికలనైనఁ దలంచియుంటిమా. పోనీ! మనవీరులైన సామాన్యులనుకొంటిమా? కారు. చూడుము.

సీ॥ సుతుఁడింద్రజిత్తుని • శూరతతక్కువా!
కుంభకర్ణుని శక్తి • కొద్దిదగున!
అతికాయుఁడనుసమ్మ • హా[illegible]కాయు లలతులా!
అలయకంపనుశక్తి • యల్పమగునె!
ధూమ్రాక్షునకుఁగల్గు • దోశ్శక్తి స్వల్పమా!
కాలనేమియనంగ • ఘనుఁడుగాఁడె!
పరగనికుంభుండు • బలియుఁడుగాఁడొకొ!
మాల్యవంతునిమాట • మఱువఁదగున!
మూలబలములుచాలవా • కాల్బలంబు
తరుగుపడియెన! గుఱ్ఱపు • దండులేదె!
అపజయమునకు కారణం • బరయదుష్ట
కాలమేగాకమఱియేమి • కలదు చెప్పుమ॥

వీరాధివీరులనెందఱినో హతముఁగావించుకొని తోడుఁజుట్టము మొక్క-
దైవములేక నిరాలంబుఁడనై జీవచ్ఛవంబుమాడ్కి నున్న నా డెందంబునకుర-
ణోత్సాహమెటులఁగలుఁగు

ద్విజి— మహారాజా! ఏన్నఁడులేని బేలతనమును సూచింపుచుంటిరేల? కారణమే
మియో? మీమది సర్వధానమంగళమునే వెలిబుచ్చుచున్నది.

రావ— నామది సూచింపుటేమి? దైవమే నాయత్నములకుఁ బ్రతిహతుఁడై సర్వధా-
యమంగళమును సూచింపుచున్నాఁడు. నిజముగా నీవనినట్లు నాకెప్పుడెట్టి
కార్యమందైన నిట్టియధైర్యము కలుగలేదు. ఇట్టి దీనస్థితి సంభవింపలేదు.

సీ. దిక్కుంభి దంతముల్ • దిద్దిరఁ ద్రిప్పుచు
దిగ్విజయంబుకై • దిరుగునాఁడు
బలశాలివాలిసం • భ్రమము నీరసపుచ్చ
యుద్ధాభిలాషినై • యుఱుకునాఁడు
సురసంఘములు నాకు • శూరత నణపంగ
వచ్చినన్నెదిరించ • బడిననాఁడు
కండూతిమైకన్నుఁ • గానకార్భటవృత్తి
యెపుడ కైలాస • మెత్తునాఁడు
గూడనీసుమంతజంకుచు • గొంకులేక
ధీరచిత్తుఁడనగు నాకు • దీనవృత్తి
కలిగె నేటికి? నిఁక జయ • కాంక్షఁబడుట
స్వప్నవార్తలుగాకున్నె • సచివచంద్ర!

నాకిఁక విజయసాధనములు కలలోనివార్తలే? అట్టివానిపై భ్రాంతినొందుట నిర-
ర్థకమేయగు. అబ్బా! ఆరామునిమహిమయో వానరాక్షసులకర్మమో గాని యీ
మానవాధములకట్టి, కెదురుకత్తి లేక నిరంకుశముగా వానిప్రభ మనకడసాగివచ్చు-
చున్నది.

ద్విజి— దనుజకులకంఠీరవా! కష్టసుఖంబులు కావడికుండలు. జయాపజయంబులు
దైవాధీనములగుట మనప్రాప్తి యెట్లున్నదో యట్లుకాఁగలదుగాని దిగులొందినతీ-
రునా? బొందిలోఁ బ్రాణమున్నంతవఱకు నభిమానయుతుండగు వాఁడు వైరినాళ

నెయునకై పెనగులాడ చుండవలయును, సర్వమెఱిఁగిన మీకు నేఁజెప్పఁ బోటివాఁడనా? అయ్యో! దేవా! గోటమీటఁ దగుకార్యమునకు గొడ్డలినుపయోగింపఁ జూచు చందంబున నామానవాధముని విషయమున నింతయోచింపుచుంటి రేల? మాయా గుణ ప్రవీణులమగు మనకా రాముని నిర్జించుటన నెంత?

రావ— నీవెఱ్ఱియింకను వదలలేదుగా? అతఁడు మనమాయలలోఁ జిక్కువాఁడు కాదు అంతియగాక మనమాయలన్నియు మనలోనే సమసిపోవుచున్నవి చూడుము.

క॥ మాయోపాయములన్నియుఁ
బోయెను మారీచుతోడ • మొదలనె మఱియున్
బోయెను సర్వము తొలుతనె
ధీయుతుఁడగు నింద్రజిత్తు • తెగినకతమునన్॥

ఇంకమనలో నట్టినిపుణు లెవ్వరున్నారు? లేనిదానికై యడియాసలేల? నిజముగా రాముఁడు మాయలపాలిటి మాయగాఁ దానవులపాలిటి దానవుఁడై మంత్రముల కెల్లనాదిమంత్రమై భూమిఁబుట్టినాఁడు.

ద్విజ— లంకాధీశ్వరా! మీకున్నదేహముపైఁ గలిగినపిచ్చిమోహముచే లోకము నెమఱచి కలవరపడియున్న మనంబుచే యుద్ధవిషయమున మీరంతశ్రద్ధతీసుకొనక పోవుటచేత వైరికిఁ గలిగిన జయమునకై భ్రాంతిఁబడుచు మనుజపశువును ఘనుఁడని ప్రశంసించుట సమంజసమే?

రావ— ఓయీ! నీవుకూడ భ్రాంతిగొంటివే! నీవనినట్లు నేను యుద్ధప్రక్కని శ్రద్ధతీసికొనకుంటినందు వేని కాదనరాదు గాని నాబుద్ధిననుసరించియే నాకప్పట్లనట్టిబుద్ధిపుట్టియుండును. ఏమైనగాని గాలిచిచ్చో-బాలకలచిచ్చో-కొంపతగులఁబడి బూడిదైపోయినది. చేయునదేమి?

ద్విజ— మహారాజా! మాటిమాటికి ధైర్యము విడనాడి దినతఁబలుకుచుంటిరేగాని యుత్సాహముపొంగఁదగురీతి నుపాయమాలోచింపఁ దలపెట్టకుంటిరి.

రావ— ఏతెన్నుఁ గాంచిన విన్నదనముకలుగు సంగతులే గోచరమగుచుండ మదికి ప్రమోదమెటులగలుగు. ఆలోచనలెట్లుపాలువోవు? ఐన బుద్ధిమంతుఁడవైన నీమాట కాదనరాదు. మదిధైర్యముఁదెచ్చుకొని బొందిలోఁ బ్రాణములుండువఱకు యత్నమొనరించి యా రాముని సాధింపఁజూచెద. ఇందులకు నాకొకయుపాయము తోఁచుచున్నది. మనమా-నాడులు నరములు తెగియున్నారము. వైరియుక్కుమీరిన బ

లతేజంబులమన్నవాడు. మనప్రకారియసంపత్తి సర్వమునర్పించినప్పటికిని బుద్ధులు కల్లో మాళయనునట్లు యొక్క బక్క బంధువు కనుపించుచున్నాడు. బక్క సాయము గాదు. యొక్కవసాయమే! మనతో జాలు బాగుండక నట్లునుకొనవలసి వచ్చినది. కనియుండునుగదా మైరావణుండను ప్రతాపలంకేశ్వరుని? అతండు మాయోపాయ విశారదుండు- ధీరచిత్తుండు- బాహుపరాక్రమోపార్జితుండు- నాకుం గూర్చు చుట్టము. అతండు తలపెట్టినయెట్టి కార్యమునైన సమర్థించుకొనిరాంగల శక్తిమంతుండు. కాని, నాకై నేను పోయి వానినిసాయపడుమని ప్రార్థింపమనసొప్పకున్నది. ఏమన్న

మ॥ ఘనతేజంబున బాహుదర్పమున నే ♦ గర్వించియున్నప్పుడే
వ్వనిలక్ష్యంబునం జూడకుండితుదినా ♦ పాటిట్టునైయుండ "నే
మనిపోం జాలుదు? వేడం జూతునెరువి ♦ ఖ్యాతికి దిగద్రోచి" యం
చును వెన్కాడుచునుంటినొక్కగతిగా ♦ శుష్కింపనాయోచనల్

ఈ ప్రాణములపై నాశ చేగదాయట్లు నేయనూహించుట? అప్పటికైన విజయమే కలుగుననుటకు అవకాశమేమున్నది. కాక విజయమే చేకూరుననుకొందము. అప్పుడు నాయశమునకేమైన నివాసస్థానముండునా? దశకంఠుండు బలవంతుడయ్యు చివరకుచేతగానివాండై మైరావణుని సాయమున మహిని నిల్వగలిగినాడను యపయశంబున పైన పొల్పడవలసివచ్చును గదా! ఏతానం జూచిన నాకు గౌరవహానియే కలుగనున్నది. వేరాశలేదు. వెంటనే ఎయ్యన మైరం ము నెదుర్కొని వానిజయించుటో- వానిచేం జచ్చుటో- పర్యవసానముండే ల్పేది.

ద్వార— మహీపాలా! చెట్టు చెడుకాలమునకుం గుక్కమూంతిపిందెలు పుట్టునన్నటులకాలానుగుణ్యముగా మీమనసు సర్వథా చంచలమై మరుగుదారికే పోవుచున్నది గాని స్వచ్ఛముగునట్టిదారిని సంచరింప నిచ్చగింపకున్నది. ఎంతటి వీరునకేనిం బరుల సాయము గోరనంతమాత్రమునం బరువుకులోపము వచ్చునా, ఆరం ముండు మాత్రము వానరులం దోడు చేసికొని రాలేదా? అందువారివలె మనకీ మైరం ణుండు పరుండు గాడు. మనవంశఖ్యాతిని నిల్పం దగినవాండు. మనబాగోగులలోనం బాలుగొనం దగినవాండు. మనకైనవాండు. అట్టివానిని సాయపడం గోరుటసరసము గాదే! ఏమి భ్రాంతి?

రావ— వినవో మంత్రివరా! నీమాట కెదురాడరాదు. తొలుత ధయిుతుండగు విభీష

వలదు, వలదు. ఇట్టిపరిగల్భగర్వాంధునకు మహాపతివ్రతవగు నీవు నమస్కరించిన నిహపరంబుల రెంటికిని చెడిపోదువు సుమీ! తన్వీ!

చ॥ సురగరుడోరగాదిరణ ♦ శూరులసైత మెదిర్చి ఘోర సం
గరమున వారినోడ్చి పలు ♦ కష్టములుప్పతిలంగఁ జేసి సు
స్థిరయశముం గణించినను ♦ తేజమొసంగిన నాటి రావణా
సురుఁ డతలంపుఁ గాంచితఁడు ♦ సుందరి! నీవు నమస్కరింపఁగన్॥

ఇట్టియపాత్రుని- కులనాశకుని- పోవుబోతును- సభలోఁ యనుకొన్నను గౌరవహీనమే! ఇంకనా దేవు ప్రతిష్ఠల నెన్నక నాయాశ పెట్టుకొనక నయిష్టమగుతో వంజూచుకొమ్ము. కాలానుసరణముగ విధమనవాఁడై నాకు విజయము చేకూరిన సంతసింపవచ్చును. నేటితో సర్వము నిరాశఁ జేసికొనుము.

మండో — ప్రాణేశ్వరా! ఇంతలో నింత విపరీతమగునని కలనైన దలంపమైతిమిగదా అయ్యయో!

ఉ॥ చిచ్చొడిఁగట్టి తెచ్చి గృహ ♦ సీమను దాచు విధంబుగా నయో
తెచ్చి విదేహరాజసుతఁ ♦ గెంపరి వైసుఖముల్ దొలంగఁగాఁ
బచ్చని కొంపకూలసరి ♦ వారలు నవ్వఁగ మంద బుద్ధిమీ
యిచ్చఁ జరించుచుంటిరిఁక ♦ నే నిసుఖంబునుఁ గాంచఁ జూడుడీ;

మీ కెందరెందరో చెప్పిరి. వారిమాటలు మీకు రుచింపవాయె. చూడుడు. మీదు రోమోహజనితమగు పంతపుబుద్ధి మన కెట్టివిపత్తులకు కారణమయ్యెనో!

ఉ॥ అంతట పెంచ్చు కాపురము ♦ నారడియయ్యెను పేరుగన్న నీ
మంతులు శౌర్యధుర్యులున - మాత్యులు గూలిరి పుత్రవర్గముల్
వంతలఁ దూగి నారుమన ♦ వారలటంచను పేరు మాసెనిం
కెంతలభింపనున్నదొకొ ♦ యీగతి నూర్ధ్వము వీడకుండినన్॥

అయ్యయో! కడకు జీవితాశను గూడ వదలి మంచిచెడుగులఁ దలపెట్టకుంటిరి గదా! నేనెట్లు భరింపఁగలదానను. ప్రాణేశ్వరా! ఇకనైన నా ప్రార్థన నాలకించి సుఖింపఁడగు నుపాయము సగిసికొండు.

రావ — తన్వీ! సికదియేటి వెఱ్ఱి?

చ॥ గిరిజలసేతుబంధనము ♦ కెవడికెక్కటి దానినెంచుచుఁ
సతతముఁగుందనేలవినుఁ ♦ సారసనేత్రిరో! కాలకర్మమే
గతినిజరించుచుండునోయి ♦ ఖండితరంబుగ బుద్ధియందుకుఁ
హితముగఁబోవుగానిమన ♦ యిష్టమెకాదనిసంచరింపఁగఁ

మంచిచేష్టలకుఁగాని-కీర్త్యపకీర్తులకుఁగాని- కష్టసుఖంబులకుఁగాని- మనశక్తిసంపదలు సాధ్యములుగావు. విధి యేవిధిజరుగనున్నదో యట్లుజరుగకమానదు. కావునవంటరిడక్కి ధీరస్వాంతవై ముందుజరుగఁబోవునావిధానమునకుఁజేయూతినొసంగినట్లుల నపయాశంబగిఁ గంటఁడిశిపెట్టకఁ దగుహితోపదేశమొనరింపుము.

మండో— అయ్యో! ఇంకను ముందుయత్నమా! ఏమియత్నములఁజేసి యేమిప్రయోజనము! సర్వనాశనమై నెటకిమీ అక్కఱ రేగిదా పగిలియున్నది. ఏమి యత్నములఁజేయఁగలము. ఇదెక్కడిమందబుద్ధి? చెట్టుమీఁదపక్షికైనసందియగలదుగాని మనకేదన చెట్టయుండునుయనేగగిదా!

రావ— తరుణీ! నేరుదిక్కెఱుకొనలయు? నా బాహుబలంగ నమిఁచెదుదు నమా సనునిపగపరిభ్రాంతములునాకు దండియుండనై యుండునేదా?

మండో— హృదయేశా! మీనెత్తుమీకింకను వదలలేదు. మీకుఁ యాము కలుగునని యేనా మీఅక్షీపాక్షియము? పట్టపనికిమాలిన సిగ్గుముచేఁగొందుమ దుష్టులద్వేష నెన్నలయునాధను లేదెరు.

రావ— ఇంతీ! నీవెంత తెలవు? నీ దంతస్వల్పబుద్ధి? జయాపజయములనిర్ణయించనెవరికసాధ్యము? పోనీ! నీవనట్లుజయము చేకూరకున్నను వీరపురుషుఁడగువాఁడపమానమునకులోనై నిష్ప్రియత్నుఁడై యుండదగునా!

గీ॥ రోగిజీవింపఁడనుచును ♦ రోసివాని
కౌషధమీడంగ వెనుకాడ ♦ సర్హమగునె?
చచ్చునో; లేక బ్రతుకునో ♦ సాహసించి
చెప్ప నేరికిసలవియా ♦ జెప్పుమబల॥

కావున

గీ॥ జీవముండెడువఱకును ♦ చేతనైన
యెల్లయత్నంబులను జేయఁ ♦ జెల్లుగాని

ఫలము లేదని యాశలఁ • బారద్రోలి
చింత నొందుచుఁ గూర్చుంట • శ్రేష్ఠమగునె॥

అంతియగాక ప్రాణములనిత్యములు. భోగభాగ్యంబు లశాశ్వతములు. కీర్త్యపకీర్తులు మాత్రమే స్థిరములు. మఱియు

చ॥ క్షితిపయి జన్మమొందు ప్రతి • జీవికి మృత్యువు దప్పదెప్పుడే
గతిని దినచ్చునో దెలియఁ • గాఁజన దేరికి; నంతదానికే
ధృతి విడఁ ద్రోలంగి గర్వమున • దేవురలాడుచు నుండ్రు వెఱ్ఱులై
మతిచలనంబుచే నురభి • మానము కన్నులఁ గప్పియుండఁగన్॥

కీర్తినిఁ గోరువాఁ డెప్పుడును బ్రాణభయము కలుగునని వెనుకాడఁగూడదు. పురుషలక్షణమగు పౌరుషమును వీటఁబుచ్చి ప్రతిక్లిష్ట మార్గమున రానున్న యాపదలు రాకఁ బెగ్గనా!

గీ॥ రామచంద్రుని శరణన్న • రాకయున్నె
చావుయేనాటికైనని • రావణునకు
నేఁడో? రేపటో? చానుండు • నిశ్చయంబు
నకును యశమును గోల్పోవ • న్యాయమగునె॥

ప్రాణములపైఁ దీపచే యశమును గాసింపకుండుట యాడుదాని పని. సర్వయత్నములు జయకాంక్ష నభిలషించియే మేము ప్రవర్తింపవలయు. అట్టి యత్నములు సలిపిన సఫలమనోరథులు కాకుండుట సంభవింపదు. అంతగా సంభవించిన సంభవింపనిమ్ము

మండో— దేవా! నిజమే! సర్వయత్నములఁ జేసితిరిగదా! దైవమననుకూలుఁడయ్యె. అందులకుఁ దగినటులఁ బ్రవర్తిల్లఁ బలదా!

రావ— ఛీ! దైవము మనయెడలఁ బూర్తిగా విముఖుఁడు కాలేదు. జయసాధనము లింకను గలవు. మనకు మంచియుండయుండె, మించిపోయినది లేదు. మైరావణుని సహాయసంపత్తినే నేఁడొక ఘనకార్యమును జేయనుంటిని. అందు మనకుఁ దప్పక జయము చేకూరును. వైరినాశనము కాఁగలదు. జానకీభోగప్రాప్తి నాకు లభింపఁగలదు.

మండో— (స్వగ) అకటా! ఏమి యీ మోహాంధుని పిచ్చియాశలు! కాముకులు యుక్తాయుక్తవిచారణ— స్వశక్తిపరశక్తి తారతమ్యము— కీర్త్యపకీర్తులు— గణింపరుగదా!

(ప్రకాశ) నాథా! అఘనకార్యమేదియో నాకెఱింగించఁబడినదియేనా?

రావ — ఎఱింగింపరాకేమి? వినుము.

శా॥ మాయాకార్యధురంధరుండయిన యా • మైరావణుం జేరి యే
మాయామర్మముచేతనైన మఱియే • మంత్రాళిచేనైన వే
బాముజ్జేయుదురాముప్రాణముల నా • పంతంబు నెగ్గింతు నేఁ
డేయార్జింతుయశంబు నాప్రతిభ నీ • యీరేడులోకంబులన్॥

ఈరహస్యము రెండవవాని చెవి కెక్కనీయఁగూడదని యింతవఱకు నేరికిఁజెప్పక నీతోఁగూడ చెప్పశంకించితిని. నీయాందోళన మధికమగుటచేఁ జెప్పకతప్పినది గాదు. ఇంకనీచింతవీడి ధైర్యస్వాంతంబున నంతిపురంబునకుఁబొమ్ము.

మండో — మహారాజా! కోపగించుకొనకుందు రేని నేనొకమనవి జేసెద. లెక్కకుమీఱిన వీరాధివీరుల తేజోబలదర్పంబులు శ్రీరాముని చెంత నిష్ప్రయోజనమైయుండ మైరావణునిశక్తిమాత్రము వానిని జయింపసాధకమగునే? ఎంతపిచ్చియో హా?

గీ॥ గడ్డిపోచనుమదినమ్మి • కడలినీఁద
దలఁచునెట్టివిధంబున • దనుజనాథ!
నమ్మిమైరావణునిశక్తి • నరునిరామ
భద్రునిజయింపఁదలఁతువే • భ్రాంతిఁజిక్కి॥

మీయుపాయయుక్తము గాదనినుడువుచున్న నాయజ్ఞానమును క్షమింపవేడుచున్నదాన. అకటా! భ్రాంతిమిమ్మెంతశ్రమ బెట్టుచున్నది. శ్రీరాముని మహిమలు మీకిప్పటికిఁ దెలియకుండెఁగా! చూడుఁడు.

గీ॥ మాయలకు హెచ్చుమాయయై • మసలువాఁడు
మంత్రతంత్రంబులకుఁదొంటి • మాటకాఁడు
దీనజనులనుబ్రోచుసు • ధీవరుఁడు
వైరిజనులకుఁగాలుని • వంటివాఁడు॥

ఇఁకనైననా మాటలాలించి శ్రీరామునకు సీతనొసంగి సుఖజీవివై యుండఁజూడుఁడు. పండుపంటికాపురము పాడైపోయినప్పటికి మీరైనసుఖముగానుండినఁజాలు గాదె-మీరెన్నివిధములఁదలంచినను శ్రీరాముని-జగదభిరాముని-సుజనసుత్రాముని

సంగ్రామభీముని - వైరిబలోద్ధాముని - మీరిఁకజయింపఁజాలరు. చూడఁజూడన తఁడు దానవవంశసంహారంబునకై భూమినవతరించిన నారాయణుఁడని చెప్పు పెద్దలమాటలు నేటికినిజములైనవి. అనీత మీపాలిటిమృత్యుదేవతయనుమాటవాస్తవమే సుండీ! కావునకానిదానికై కడగండ్లనుంగుచు నన్నేలయనాథనుజేయఁజూచెదరు.

రావ — ప్రియే! సర్వమంగళాంగివైననీవు నేఁడిటులమంగళములఁబల్కుటయునా విధిచైదములేనుమీ! లేకున్న వీరాధివీరుఁడనగు నాయర్ధాంగివైన నీనోటనీలపల్కులువెడలునా! అక్కటకక్కటా! ఎట్టిఘోరములు వినుచుంటిని. సర్వభూతమ్ము ముసుగాంచుకొన్నతిరువానిగా శరణువేడుమనుచుంటివి. అందరువచ్చినతరువాత నాప్రాణములున్ననేమి! లేకున్ననేమి! నాప్రాణములంతతీపిలోనివికావు. నా ప్రాణములపై నేనేమనియాశఁజెందపనే.

సీ॥ పలినాడనుభూమి • నేలాతరలిత్రఁ
బగుమించెలఁగవిజ • యంబుగాఁగ
చేపట్టినాఁడను • సిరియుసంపత్తుల
నెలవేనితుల్యలేని • విధముదోఁప
ననుభవించితినిసకి • యైశ్వర్యములభోగ
భాగ్యంబులనుతృప్తి • భాసురముగ
నార్జించితినికీర్తి • నరిపీనులజయించి
బాహుపరాక్రమ • భాగ్యగరిమఁ
దనివిఁజెందితిమోహమిఁక • తనువుపైని
నడలెవారలునాకింక • వసుధపైని
భార్యమైత్రులు చే; ప్రాణముల్ • బాయుటేకకు
కోట్లకై యుద్ధానికిఁగోరిన • గుందనేల?

మఱియు మీరనుసటులనన్నుఁజంపుటకుగదా నారాయణుఁడు భూమినినరరూపంబునజన్మించినాఁడు, అట్టివానిచేఁజావులభించుట భాగ్యమేగదా! ఎందునినా భాగ్యమునకు లోపములేదు. ఏమన్న

ల్లి చేయక మానదు. ఇదే! వ్యాకడసారి వందనమాచరించెద నాకనుజ్ఞయియ్యుండు.

రావ— మంచిదిపోయిరమ్మా.

మండో— (నిష్క్రమించుచున్నది.)

రావ— (విచారముతో) అక్కటా! మైరావణుని చెంతకరిగిన మంత్రిరాఁడయ్యె. అతఁడు నాకుసాయమును జేయసమ్మతించెనో? లేదో?

సీ॥ సేవకుండట్టుల ♦ శిరసావహించినా
యాజ్ఞను లంకకు ♦ నరుగఁడేమొ?
అరుగకయుండునా ♦ యోచించి నాదర్పంబు?
జరిగిన రావణు ♦ నక్షరాత్రి
దర్శించినాస్థితిఁ ♦ దగినట్లువివరించు
నిలయ్యెనో? లేదా ♦ విశ్వసించి?
వివరింపకుండునా? ♦ వివరించినను రాము
దర్పంబు వినుచుచే ♦ ధైర్యముడిగి
భీతి బెనగొన నాత్మలోఁ ♦ బ్రేమవిడిచి
సాయపడుటకు నాకిపుడు ♦ సంశయించె
నేమొ! రావణుఁడక్కటా ♦ యొంటిగా రాము
నెల్లగడచెదఁగీ వెత ♦ కేదిదారి?॥

సేవ— (ప్రవేశించి) దేవా! మైరావణరాక్షసేంద్రుఁడు మీరాకకెదురుచూచు చువాకిటియందున్నాఁడు. ఏమియాజ్ఞ?

రావ— ఓరీ! ఇంకను నాజ్ఞయా! వేవేగ నిందురాఁబ్రార్థించితినని విన్నవించి తోడ్కొని రమ్మా.

సేవ— చిత్తము. (నిష్క్రమణము)

ప్రవేశము— మైరావణుఁడు

రావ— (ఎదురేగి తెచ్చి కూర్చుండనునిచి) పాతాళలంకాధిపా! ప్రతాపలోకాధిపా! మామా! వందనములు.

మైరా— ధీవిశారదా! సమయముగాని సమయమున నాకొఱకంపిన కారణమేమైయుం డును. ఇదివఱకెన్నఁడు నాసాయ మపేక్షించినవాఁడవు కావు. నేఁడు నావలన నీవు

మ॥ తెనవారెవ్వఁడు నైరివతుమునఁజే • గెల్ సేయనూహించి దా
మనమర్మంబుల సెప్పబూనెనో వృథా • మాన్యగ్యవృత్తంబులో
విన రోఁగారలు కొండలాయెనపుడే • విజ్ఞానముఁ బాసి కా
చిన వంశంబు నశింప నే మిగిలితిఁ • జీవచ్ఛవంబట్లుగా ॥

మైరా—సరి! సరి! తెలిసినది. పయి సంగతులఁ జెప్పనవసరంలేదు. దేనికయినా నీ యజ్ఞానమే కారణముగా కనఁబడుచున్నది. గతించినదానికి వగచుట గతజలసేతు బంధనమగు వినుము, నాశక్తి నీవెఱిఁగినదేగదా !

మ॥ ధరానాకాశముఁ జేతుఁ బూనిక్రమతఁ • దాళంబు వాయింతు భీ
కరమాయుత్తిగి జంద్రబంధనము వే • గావించెదఁ గొల్లుచే
నరిచేగానుపింతు స్వర్గమును బ్రహ్మ • నందమానట్లునీ
వెఱుగఁ జాలవె నా మహాయలకలా • వేయేల భాషింపఁగన్ ॥

సునాయాసముగా క్షణమాత్రములో రామలక్ష్మణులఁ దెచ్చి యీ రాత్రిఁ గాళికాదేవికి బలియిచ్చి నీ యభీష్టమునుఁ దీర్చెద. నీ మనోవ్యాకులతఁ గడతేర్చెద జానకిని నీ జతఁ జేర్చెద. లంకాపట్టణమును పూర్వప్రశోభకుఁ దెచ్చెద కీర్తి కాంతి నినుఁ బాయకుండఁ జేసెద.

రావ—మామా! నీవంతవాఁడవనియేగదా నిన్నర్థించినది. నీటముంచిన పాల ముంచిన నీదే భారము. ఏకార్యమైన నీరాత్రియే జరిగి తీరవలె. తడసిలితె రేపు నాతనువుండదు.

మైరా—ఇంతి చెప్పవలెనా! ఇఁక నాకు సెలవొసంగుము. పోయివచ్చెద.

రావ—దయయుంచుము.

(అందరు నిష్క్రమించుచున్నారు)

---

రాము—తమ్ముఁడా! రావణుఁడు సామాన్య రక్కసుఁడుగాఁడు. లౌకికజ్ఞాన సంపన్నుఁడు. సాహసవంతుఁడు దీర్ఘాలోచనాపరుఁడు అట్టివాఁడు మానాభిమానములఁ బరిగణింపకఁ బ్రాణములందలి తీపిచేఁ బారిపోయినాడనుటకు వీలులేదు ఏదియో మహత్తరసన్నాహమందభిలాషియై యట్లొనరించియుండును. ఏ వేళకేమి మాఱు నొనర్చునో యని సందియము కలుగుచున్నది.

లక్ష్మ—మహానుభావా! కీర్తికినోడి రణరంగమునుండి పలాయనము నొందినపంద మనకేమి హానియొనర్పఁగలఁడు? తలప్రాణము తోకకువచ్చి పోక కొట్టుకొనుచున్న సన్నగము పైఁబడి కఱచునను భ్రాంతినిబొంది యున్న ధైర్య స్థైర్యములఁ గోలుపోయి పరుగిడిన భావ్యమే! కాక వాఁడు గట్టివాఁడై దిట్టతనమున మనకు దెబ్బఁదెచ్చిపెట్టునని యే తలంపున అంతమాత్రమున కేమి మునింగినది?

ఉ॥ లెక్కఁడరానిరాకసకు ◆ ఏనులుమీఱ పెనుబాణధాటికిం
జిక్కి నిమేషమాత్రమున ◆ జీవములే విడనాడియుండఁగా
దిక్కు నశించిపోవనది ◆ దీనతచే గృశియింపుచున్ననీ
రక్కసుడా? రఘూత్తమ! దు ◆ రంతము సేయఁదలంచుటక్కటా ॥

వచ్చిన రానిండు ఎట్లును వాఁడు మీచేఁజావవలసినదేగదా! వచ్చెనా మనకు వాఁడు నిజముగా మహోపకారియే; పారిపోయి దాఁగియున్నవానిని వెదకికొను భారము మనయందుండును.

రాము—కాని తమ్ముఁడా! వాని పలాయన మంత్రపఠనమునకుఁ గారణమేమియో యూహింపఁగలవా?

లక్ష్మ—వాని యసహాయ దుర్జనత్వముగాక వేఱు కారణమేమి యుండును?

చ॥ బలము చలంబు గ్రుంగఁదన ◆ ప్రాణములేవిధిదక్కఁబోవనే
తలఁపున జీవితాశ మదిఁ ◆ దత్తఱపెట్టఁగఁ గీర్తిమాటలన్
దలఁపక నెట్టులైన వసు ◆ ధన్మనియుండుట మేలటంచుఁదా
దొలఁగెను గాక వేఱువిధి ◆ దోఁచి పలాయనమొందఁ జెప్పుడున్

సుగ్రీ—మహాత్మా! సుమిత్రానందనుఁడు సత్యము వచించినాఁడు.

హను—దేవా! జానకీరమణా! కదనరంగంబున మీ పదును శరంబులదాటికి నిల

లేకఁ దనకేవిధి బ్రాణములు దక్కఁబోవని తలంచి ప్రాణంబులఁ దక్కించుకొనునుపాయం బెఱుంగక నొకవేళ శరణన్నను మీరిప్పుడు రక్షింతురో రక్షింపరో యను శంకచే గీర్త్యపకీర్తులమాటఁ దరువాత చూచుకొందము ప్రాణములుండిన బలుసాకూరయైన దిని బ్రతుకవచ్చునని రణభూమినుండి కాలికిబుద్ధిచెప్పిన పంద విషయమై మీ రింత ప్రసంశ సేయనేల! ఎందుకీలేని వలనంత ?

రాము.—వీరనాయకులారా! మీ రందఱీ విషయమై యేకాభిప్రాయులు సమంజసమే గాని నాకుమాత్రము మీరు పొరబడుచుండిరని చెప్పక తప్పదు తాను పట్టినపట్టు పాపహేతువని తెలిసియుండియు దానిని విడువక పుత్రమిత్రబాంధవులనైన గణింపక సర్వనాశనము గావించుకొనినవాఁడు తన ప్రాణములపై మాత్రము నాశవహించి పాఱిపోవునే? వానికిఁ బ్రాణములు తృణప్రాయములని వాని పదములే చెప్పుచున్నవి. మనము కన్నులారఁ జూచుచునే యున్నాము. అట్టివాఁడు ప్రాణభీతినిబడి పలాయనము చెప్పినాడనుకొనుట పట్టిభ్రమయగును. వానిపలాయనమునకుఁ గారణము వేఱుగానుండియుండుననుట నిశ్చయము. వానిని గణింపకఁ బరాకున విడువఁదగినవాడుకాడు; నేడేమియో నా మది సకల సంశయములనే సూచింపుచున్నది.

లక్ష్మ.—రామచంద్రా! ప్రాణభయాతిరేకమున బరుగిడినవాఁడేమియో చేయునని సంశయించుట భద్రమగునే? వేటగానిచే దెబ్బతిని చావసిద్ధమై తన్నుకొనుచున్న బెబ్బులి యార్భాటమునుఁ జూచి పైఁబడి పట్టి చంపునని తలంచుట వెఱ్ఱితనముగదా!

రాము.—లక్ష్మణా చక్కని యుపమానమును సూచించితివి గాని మృగయుని వ్రేటుచే గంతగతావశేషమై యుండియు మృగము వెనుకంజవేసెగదా మృగయునిపైకురుకుట! అది గుఱ్ఱాలింగకఁ బ్రవర్తించిన ముప్పుగాకయుండునే ?

హను.—మహాత్మా! ఇదమిద్ధమని మీ మ్రోలనుడువఁజాలనుగాని యీ రావణుఁడంతటి మూర్ఖుఁడు ప్రపంచములో మఱియొకఁడు లేఁడు వాఁడొనరించు మాయలన్నియు వానినాశనమునకేగదా యుపకరించుచున్నవి. వాఁడది తెలుసుకొనఁజాలక గర్వంబున మిట్టిపడుచు నింత చేటుఁ దెచ్చుకొనినాడు. ఇంతటనైన బుద్ధిఁ దెచ్చుకొని బ్రతుక నేగిన నేగియుండును; కాకమీరనినట్లే దియేని దుష్కార్యకరణాసులోలుఁడై యారంభించిన యారంభించుగాక! వాటి ఫలితముమాత్రమనుభవింపకపోవునా ?

లక్ష్మ — నిశ్చయము. వాఁడీజన్మలో నెట్టికార్యమునకు నింక గడంగఁడు. కాక బుద్ధిమాంద్యమున ప్రయత్నించిన బ్రయత్నించనిండు. వాని మాయా మర్మ తంత్ర మంత్రములు మనకడ సాగిరావనుట మీరెఱుంగనిది కాదు.

శా॥ మానమ్ముల్ విడనాడియింకనువృథా ♦ మాత్సర్యవృత్తంబుతో
కానిమ్మా దశకంఠు డేమిసలుపం ♦ గానాత్మనూహించునో;
రానిమ్మా యుధమాధముల్ దునిమిహ ♦ ర్షంబుల్ వినోదంబుగా
దూరాశీరంబున బంతులాటలక్రియన్ ♦ దోర్లింపఁగాఁ జూడనే

హను — ఆపనికిపూరు గావలయునా? రామచంద్రా ఆరావణుఁడు చావలేక బ్రతుకుచుండాళచే బోయినాడనుట నిశ్చయము. అట్లుగాక పంతబుద్ధిని మఱల నేగియేని మాయఁజేయవచ్చిన

చ॥ కనబడినంతమాత్రమున ♦ గాలుఁగ దల్పఁగనీకతోకచే
త నదిమి బట్టి చుట్టివ్రిమ ♦ దంబునబోంగిరమట్లు ద్రిప్పి వే
గను భువిపైన గొట్టివిరు ♦ గన్ యెముకల్ జముసింటికాపుగాఁ
బనిబడిపంపకే విడుచు ♦ వాఁడనె మాయల నెన్ని జేసినన్!

రామ — యోధవరులారా! మీ అందరంతటి సాహసవంతులేయగుదురు. సంశయము లేదు. కాని రావణుఁడన్న మాయా మర్మ తంత్రజ్ఞుండు. వాని చైదములఁగనుగొన బ్రహ్మకైన వశంబుగాదు. వినరే సంజీవికై వెళ్ళిన హనుమంతుని కాలనేమి యను రక్కసునిద్వారా నెంత గగ్గోలు పఱచినాడో? అట్టివానిచర్యలెఱుంగవచ్చిన బ్రతిక్రియ సేయఁగలముగాని తెలియకవచ్చి పిడుగుచందంబున నెత్తిపై బడిన నేమి సేయఁగలము.

సుగ్రీ — మహాభాగా! మేము కనుగొనలేకున్నను వానిచర్యలఁగనిపెట్టుటకు విభీషణుఁడు మనకు నండగాలభించెగదా! ఇంక నేమిభయము. సర్వమెఱింగియు నేడు మీరింత సంశయాకుల చిత్తులైరేమి కారణమో స్ఫురింపకున్నది?

రాము — వనచరనాయకా! జ్ఞానవంతులరగుట మీ రెక్కడికక్కడికేదియో సరిపుచ్చి నామనో వైక్లబ్యమును బారఁదోలఁజూచుచున్నారు. కాని యే కారణమునవో నాచిత్త మన్యథా పాదరసక్రియఁబరుగులిడుచు సంశయమునే సూచింపుచున్నది. యేమియాపద సంఘటిల్లునో? జానకీ సంయోగము నాకీజన్మ

రాము—మంచిది. విశ్రమింపుము.

లక్ష్మ—చిత్తము (అని శయనించుచున్నాఁడు)

రాము—సుగ్రీవాంగదాది వీరులారా! మీరును మీమీ పనులఁ జూచుకొనుచుండుఁడు.

వాన—చిత్తము. (అని నిష్క్రమించుచున్నారు)

రాము—హనుమంతా! నీవును గడు బడలియున్నావు గదా!

హను—మహాత్మా! నాకేటి బడలిక? ఈ వానరులందఱు నేటియుద్ధమునఁ గడు బడలియున్నారు. వారికి విశ్రాంతి నొసంగి నేనేమఱక శిబిరముఁ గాచుచుండెద.

రాము—మంచిది నీ యిష్టమే గానిమ్ము. (తనలో) అక్కటా! ఈ రావణాధముని పీడ నాకెంతకాలమునకుఁ దీరనట్లున్నది. నా జానకీ సంయోగభాగ్యము నాకు లభించునో లభింపదో తెలియకున్నది. హా! జానకీ! జానకీ! నా మూలమున నీ కెంత యాపదఘటిల్లినది?

మ॥ సకలక్షోణిప మండలీముకుటభా • స్వత్పాద పంకేరుహాల్
పరికర్మానందముఁ బొందనీకరముఁ జే • పట్టంగ నూహించిరన్
వికలత్వంబున వారిరోసికడకున్ • వేమారు నన్ గోరి హా
సకలానర్థము లొందుచుంటి విగిని • చందంబునన్ జానకీ!

అయ్యో! నేనెంత కఠినకర్ముఁడను. చిన్నతనమాది నన్నే వలచి చేపట్టియున్న కాంతామణి క్షేమమారయఁజాలక గటికవాని చందంబునఁ గాంతారంబునకుఁ గొనివచ్చి గాసియపెట్టుచుండినను సంతసంబున భరించి నన్నే దైవముగా భావించి నాయందనురాగమును బాయకుండిన సతీలలామను క్రూరమతినై కార్చిరక్కసులపాలంజేసి కుందఁజేయుచుంటినిగదా! హా సుగుణరాసీ! మైథిలీ! పరమపతివ్రతా!

ఉ॥ మోసముఁ జేసినిన్నసురలు • మ్రుచ్చిలినట్టి దశాస్యుఁ జంపియున్
హాసవిరాజమానమగు • నట్టి త్వదీయ ముఖేందుబింబమే
నాసలుదీరఁ జూచుటకు • నార్తిని బొందుచునుంటిగాని నా
యాసమెయోగాక సుకృతఫల • మందెడిభాగ్యముఁ గాననైతిగా॥

అయ్యో! నిన్నెప్పుడు గనుగొందు? నీ విలాససౌందర్య విభ్రమాదుల నెప్పుడు వీక్షింతు? నీ యాలింగన సౌఖ్యం బెప్పుడు బొందుదు?

సీ॥ సంపూర్ణపూర్ణిమా • చంద్రబింబసమానఁ
మగు నీదు నగుమోము • నరయు టెపుడొ?
మదమత్తమాతంగ • మందయానము డెందు
పఱచు నీ నడకల • భ్రాంతి యెపుడొ?
చిలుకపల్కుల గేలి • సేయఁజాలిన ముద్దు
పలుకులాలించెడు • భాగ్య మెప్పుడొ?
లేదనిసనరీతి • కాదనిపించు నీ
దేహసౌఖ్యము జెంది • దనరు టెపుడొ?
వాలుఁగన్నులసోయగ • జాలుఁజూచి
మమత పైఁగప్పదరిఁ జేరి • మంచిమాట
లాడి మెప్పించినీయండ • నలరు టెపుడొ?
కాంత! మనచింతలను వీడ • గలుగు టెపుడొ?

ఇంతటనైన రావణునిఁ బరిమార్చి నీ చెర విడిపింపఁగలనో? లేదో? జయాపజయంబుల నిర్ణయింప నాకింకను సాధ్యము గాకున్నది. సాధ్వీ! ఆ మొరటు రక్కసుని బారిఁ జిక్కి నీ వెంత యడలుచుంటివో? నీ వెంత పరితపించుచుంటివో? నీ బాధలఁ దీర్చిపుచ్చుటకు నాకింకెంతకాలము పట్టునో? ఈ దానవుని వైదము లొకప్పుడుండినటు లొకప్పుడుండుట లేదు. ఈ రావణుఁడు నేఁడు యుద్ధవిముఖుఁడై పలాయన మంత్రమ్ముఁ బఠించుటచేత నాకేమియుఁ దోఁచక నామనము పాదరసక్రియఁ బాఱుచున్నది. అతఁడట్లు పోవుటకుఁ గారణము తనకింక జయము చేకూరదని నిశ్చయించి నీపైఁగల మోహమును వదలి నిన్ను నా జతఁ గూర్చి తనప్రాణంబులఁ దక్కించుకొనుటకో — లేక నీ కతనంబున తనవంశము నిర్వంశమైనదను నీర్ష్యచే దనచావెట్టులయిన నిశ్చయంబనియెంచి నిన్నేలమని యుండనీయవలెననుచు నెంచి నిన్నంతమొందించి తాను రణముఖంబున మడియుటకో యై యుండవలయు. వేదవేదాంగ పారంగతుఁడై—నవవ్యాకరణ వేత్తయై

లౌకికజ్ఞానయుతుఁడై — శివభక్తితత్పరుఁడై — కీర్తిప్రతాపముల రాజ్యమేలు దేశాధీశున కవిసావమందైన పశ్చాత్తాపము కలిగి నిన్ను నాయందుఁ జేర్ప సూచింపవచ్చును గాని నా గ్రహచారవశంబున వానికట్టిబుద్ధి పుట్టుననుటకు వీలు లేదు. వాఁడు నీకేదియో నపకారముఁ జేయ నూహించియే పోయినాఁడనుట నిశ్చయము. అయ్యో! ప్రేటుదిన్న కొదమసింగంబు పైఁబడి సర్వశూన్యమును గావించుకొని గాండ్రుగాండ్రుమనుచున్న క్రూరకర్ముఁడు — కఠినచిత్తుఁడు — దురాత్ముఁడు నీకేమపకారము సేయునో? ఈ పాడుచెవులీనాఁడే పాపపు వార్త విననున్నవో? దైవమా! నా సంతాపమున కేనాఁటికయిన మేరగలుగునని యెంచియుంటినిగాని యిట్లగునని యొక్కనాఁడును దలంపనైతి హా! సీతా! లోకప్రఖ్యాతా! నీ పూతచారిత్రమును నే మఱువఁగలనా? అయ్యో! ఈ నిర్భాగ్యపు రామునకింతయే ప్రాప్తమా? నిన్ను నిష్కారణముగ నడవులకుం గొనివచ్చి కష్టములపాలు గావించితినని నాపైఁ గినిసి నాజంటఁ గూడనొల్లక యుంటివా? అయ్యో! నీ వియోగము నేనెట్లు సైరింతు? ఈ మోహమున నెటులఁ దాళుకొందు? ఈ దుఃఖవార్ధి నేనెటుల నీదుదు? పూర్ణిమచంద్రుని ధిక్కరించు నీమోమెప్పుడు గాంతు? లేదు లేదు! అడియాస నొందుటే గాని నాకట్టిభాగ్యము లభింపదు. నేఁటితో నీకు నాకు సరిపోయెనట్లు దెలుపుచూ నా మది ధైర్యము నన్ను బాసి యెందో పరుగిడుచున్నది. శహబాష్! ధైర్యలక్ష్మీ! ఈ వ్యర్థపు రాముని నాశ్రయించుకొనియున్న నీకు నపకీర్తియే సుమీ! ఇంక నీదారిని నీవు జూచుకొమ్ము, సీతపైఁ బ్రేమయా! నన్ను బాసి వేవేగ వెడలుము మోహమా! స్థలాంతరములకుఁ బొమ్ము! తాపమా! నీయిచ్చవచ్చినట్లు సంచరింపుము. హా గగనలక్ష్మీ! తటాలున వచ్చి నాపైఁ బడుము. భూదేవీ! నీకన్న కాన్పును గడగండ్లముంచుచుంటినని నాపై నీర్ష్యచే నాపైఁ గోపగించి నన్ను మాయము సేయ శంకింతువేమో! నీ పట్టిని నీదాపునకుఁ జేర్చుకొనుచుంటివి గాన నీవయిన నాయందు దయఁబూని మా దాంపత్యమును నెడఁబాపక నన్నుగూడా నీలోనికిఁ జేర్చుకొనుము. అయ్యో! మోహము, తాపము దుఃఖము — భ్రాంతి! రావణా! ఎంతజేసితివి? — హా సీతా! — సీతా — సీతా సీ—తాఁ — (అని మూర్ఛిల్లుచున్నాఁడు)

హను — ఆహా! రామచంద్రునకు సీతాదేవిపైఁగల ప్రేమ మిగ్గలముగదా! ఒక్క రామచంద్రున కేయన నేల? లోకంబున నెల్లవారికిఁ బ్రియకాంతా వియోగము దుస్సహమైనదే.

చ॥ తలఁపఁగ నీదుయోచనల • ధైర్యముఁ జిక్కఁగఁ బట్టనీదు న్యా
కులత నశింపనీదు సుఖ • కోర్కులఁ గోరఁగనీదు యెందుఁ గాఁ
గల పనులందుమార్గమును • గన్పడనీయదు ప్రాణమందునా
శలవహింపనీయదని • జాంగిన ఘోరవియోగమక్కటా ॥

(పరికించిచూచి) ఈ మహానుభావులిద్దఱు దీర్ఘనిద్రాపరవశులై యున్నట్టున్నది. (విస్మయముతో) ఏమీ! కాలమహిమ ? అప్రయత్నముగ నానోటనెట్టి యమంగళ వాక్యములు వెలువడినవి. రామచంద్రా ! అమంగళము ప్రతిహత మగుగాక ! ప్రతిహతమగుగాక ! గాఢనిద్రావశులనుటకుమారు దీర్ఘనిద్రావశులనుమాటలో నేదియో వికృతార్థము స్ఫురింపనయ్యె. ఏమికీడు ముందు రానున్నదో తెలియరాదు.

చ॥ రణముననుబాసిపోయెగద • రాక్షసనాథుఁడు కారణంబులే
కనుజనువాఁడు కాడ, యది • గాక చుసర్వముఁగూలిపోవుటల్
వనటగ్రహింపుచుండ్ దనదు • ప్రాప్తికినోడిజయాభిలాషియై
మనమున నెట్టిమోసమున • మానవనాథు నెదుర్పనుండెనో ?

(ఆలోచించి) రాక్షసుఁడెట్టి కపట వ్యూహాలనింకనుజేయఁ దలపెట్టునా ? నా దెబ్బఁ చవిచూచినవాఁడు నేనిందుండఁ బెఱిఁగియు మాయలవలనఁ బ్రయోజనము లేదని తలంపఁడా ? కానిమ్ము నానిజాడలవగయుటకు విభీషణుఁడేగియుండెఁగదా ! మలినమును మాలిన్యము చేతనే జక్కఁబరుచురీతి మాయాగుణ ప్రధానుని మోసమెఱుంగుటకు మాయలమారియే తగును. ఈ విభీషణుండును దనుజకుల సంభవుండగుట దనుజకుల కృత్యములు సర్వము వీనికి విశదమగునట్లితరులకుఁ దెలియవు. విభీషణుఁడు వచ్చుదాక నేనప్రమత్తుఁడనై జాగరూకత నీ మహానుభావులఁగాపాడుచుండెద. (ఆలకించి) అడుగుఁ జప్పుడు వినవచ్చుచున్నది. విభీషణుఁడు వచ్చుచుండెనేమో ?

ప్రవేశము: — విభీషణుఁడు.

విభీషణా ! వచ్చితివా ? యుదంతమేమి ?

విభీ— ఆంజనేయా ! ఏమనిజెప్పుదును. మాయన్నయగు రావణుఁడు సర్వనాశనముఁ గావించుకొని "నా"యనువారు లేకుండ ఖిన్నుఁడై తన మేనమామ

యు పాతాళలంకేశ్వరుఁడును శౌర్యాన్వితుండును మాయాగుణప్రధానుండును నగు మైరావణుపాదములపైఁబడి రామలక్ష్మణులఁగూర్చి తనకు విజయము చేకూర్చుమని ప్రార్థింపఁగా వాఁడును సమ్మతించి నీరేయి రామలక్ష్మణుల నెట్టులైనఁ గొనిపోయి యుదయమునఁ బాతాళలంకలోఁ గాళికాదేవికి బలినిత్తునని శపథమొనరించి పోయెనట. ఏమిసేతుము పవనతనయా !

ఉ॥ రక్కసులెల్లనేల దునిమెన్ • రామవిభుండు జయంబు వేగఁ జేఁ
జిక్కనటంచు సంతసముఁ • జెందుచునుండఁగ నేఁడు ఘోరమౌ
చిక్కిటఁ బ్రాప్తమాయె ; నెటు • సేతుము క్రూరతి వచ్చువాఁడు బల్
టక్కరి ; దిక్కు దోఁచదిఁక • టా ! మనయత్నములన్ని గూలెగా ॥

ఆంజ—విభీషణా ! ఇంతమాత్రమునకే భీతిల్లనగునా? ఇట్టి దనుజాధములెందరెందఱు హతముకాలేదు. ఇంద్రజిత్తు కుంభకర్ణుఁడాదిగాఁగల దనుజవీరుల కంటె నీతఁడు ఘనుఁడగునా? ఘనుఁడేయగుఁగాక! వానిఘనత్వము మనముందర సాగివచ్చునా ?

సీ॥ వాలంబు చేఁబట్టు • పట్టి చుట్టఁగఁజుట్టి
గగనభాగంబున • కెగరవైతు
నణురూపమును దాల్చి • యసురు నోటను జొచ్చి
పొట్టఁ జించుక వచ్చి • యట్టె నిలుతు
బాహుబలస్ఫూర్తిఁ బట్టి • దానవవీరు
గిక్కురుమనకుండ • నొక్కవైతు
నంతరిక్షము కేగి • యసురు పైనను దూకి
కదలనీయకఁ బట్టి • ఘాతఁ జేతు
పిడిగ్రుద్దులచేతను • విందుఁ జేతు
సిగ్గువచ్చెడిరీతినిఁ • జెండివైతు
చిత్రవధఁ జేతు దేహంబుఁ • జీల్చివైతు
మోదుగావింతు జలధిలో • ముంచివైతు ।

విభీ—పవనతనయా ! నీవు చెప్పువిధంబు ముఖాముఖిని నిలువంబడి జయాపజయంబుల నిర్ణయించుకొనఁజాలు వీరపురుషుల విషయమగు సన్నాహములు. మైరావణుఁడన్న రణాభిలాషియై వచ్చువాఁడుగాఁడు. రాత్రియందు నిద్రాశక్తులగు రామలక్ష్మణుల మాయోపాయంబున మోసగించి తనకార్యసాఫల్యము నొందించుకొను నుద్దేశముతో నున్నవాఁడు. అందు మైరావణుఁడు సామాన్యుడు గాఁడు.

ఉ॥ మాయలఁ జేయు మేటి; విను ♦ మానుము రావణుసాటి నేటికే
చాయను గానరాఁడు; బల ♦ శాలి శఠుండు సఖండమోసముల్
జేయఁగలట్టి ధీయుతుఁడు, ప్ర ♦ సిద్ధక్రియాకరతంత్రుఁ డెంతయో
ఆయసమానకృత్యముల ♦ నక్కట తప్పుకొనంగ రాదుగా !

ఆంజ—ఏవనేమాయె ! తాటిచెట్టెక్కువాని తలఁదన్నువాఁడుండకపోవునా ?

గీ॥ కపట సారంగముగ వచ్చి ♦ కాంతఁ బెంచి
మోసమున రాము బహుదూర ♦ మునకుఁ గొంచు
బోవు మారీచుఁడక్కటా ♦ పొలియ లేదె
పటుతరంబగు శ్రీరామ ♦ బాణశక్తి ॥

రాక్షసుల మాయలు పిటికి దేవతలకడఁ బనిసేయునేమోగాని మనపద్ద పనికి రావు. ఇంతయేల ? దానికిఁ దగు యుపాయమున్న నెఱింగింపుము ఆమార్గమున వర్తించెదము.

విభీ—మహాత్మా ! నాకేమియుఁ బొడగట్టకున్నది. రామలక్ష్మణులా నిద్రించుచుండిరి. తామసింపఁదగిన తరుణముగాదు. మాయలమారి దానవుఁ డెప్పుడేమి యొనర్చునో ? ఓ సుగ్రీవాంగదజాంబవంతాదివనచరయోధులారా ! రండి రండి. గొప్పయుత్పాదము ఘటిల్లనున్నది.

కపులు—(కోలాహలముఁ గావించుచుఁ బ్రవేశించుచున్నారు)

విభీ—అయ్యలారా ! ఇదేటి కోలాహలము. శ్రీరామ లక్ష్మణులు నిద్రించుచున్నారు. వారికి నిద్రాభంగముగాకుండ వచ్చి కార్యసాధన మాలోచింపుఁడు.

సుగ్రీ—విభీషణా ! ఏమియలజడి ?

జాంబ—మఱేమియు నప్రియములేదుగదా ?

అంగ—మరిప్పుడు బిల్వ రామాజ్ఞయైనదా ?

విభీ—తొందరపడకుడు. మైరావణుండను మాయరక్కసుడు రామలక్ష్మణుల నేటిరాత్రిగొని చని పాతాళలంకలోన గాళికాదేవికి బలి యివ్వనున్నాడు. నిద్రాభరితులగు రామలక్ష్మణుల వానిబారిబడకుండ నేటిరేయి రక్షింపవలయు.

సుగ్రీ—నాకేమి యుపాయము తోపకున్నది. రామలక్ష్మణులలేపి యీ యుదంత మెఱింగింతమా!

అంగ—అది యుక్తము గాదు. ఇందరముండి యీ స్వల్పకార్యమునకై వారినిద్రను భంగపరుపవలెనా?

సుగ్రీ—అదియు సమంజసము గాదు. ఓన విభీషణా! కార్యసాధనకు మారుతియే మేటి. నేను నామమాత్రమున రాజనై యుంటిని. గాని నాశక్తి నేతిబీరకాయ.

జాంబ—సుగ్రీవుడు నిజము బల్కినాడు.

ఆంజ—వానరవీరులారా మీరందరేకగ్రీవముగా నన్నె పెద్దజేయుచుంటిరి మీయందరికంటె నేను ఘనుడను గాను ఎట్లైన నాకిప్పుడొక యుపాయము తోచుచున్నది. అందుకు మించిన సదుపాయము వేరుండబోదు. మీకును సమ్మతంబనియే తలంతు. ఏమన్న నేను వాలమును బెంచి పాతాళలోకము బునాదిగా గగనభాగం బంటునటుల చక్కనిగోడ నిర్మించి మధ్య రామలక్ష్మణుల నునిచి నేను వాకిటగావలియుండెద. మీరును దగురీతి గోడచుట్టు భద్రమైన పహారా చేయుచుండుడు.

అందరు—అల్లే. అల్లే. మంచియోచన. మంచియోచన. సరే. రండు.

(అందరు నిష్క్రమించుచున్నారు)



శ్రీరస్తు.

# శ్రీ

# హనుమద్విజయము



## తృతీయాంకము.

లంకాపురిలోని బయలు.

ప్రవేశము:— ఘటికుఁడు, శుచిర్ముఖుఁడు.

ఘటి— ఓయీ! శుచిర్ముఖా! మర్యాద నిలుపుకొనుటకై మైరావణమహారాజుగారిముందు రామలక్ష్మణులఁ బట్టితెత్తునని పయనమై వచ్చితినిగాని నాఁటిలంకాపురీ విలాసమును దలంచి నేటివికారమునుఁ గాంచినంతనె నాయుత్సాహమంతయు నీటఁగలసి నాధైర్యసాహసము లారడివోవ నాకేదియో తెలియఁగాని మనోవేదన కలుగుచున్నది.

శుచి— ఘటికా! అఘటనాఘటన సమర్థుఁడవగు నీవే యిట్లు సమయమునకు భీతిల్లి బేలవగుచున్నావేమోయీ! ఇందాకటి నీపౌరుషము క్షణములో నెక్కడఁబోయిన కారణమేమైయుండును.

ఘటికు— వేఱుకారణమేమిగలదు? ఎందుఁజూచిన నిసుకఁజల్లిన రాలకుండునట్లు వీరాధివీరులగు రక్కసచమూపతులచే నిండియుండు లంకాపురిని నేఁడొక్క మగపురుగు కలికమునకైనఁ గానరాని స్థితిలోనుండెఁగదా! ఏయింటఁజూచిన నేడ్పులు మింటినంటెడునట్లు ప్రతిధ్వనులీనుచుండె. అట్టిబలాఢ్యులే జయముఁగాంచ శ్రీరామచంద్రుని సాధింపలేకపోయిరిగాన నిఁకమనమా మానవుల మోసగించఁగలమా?

శుచి— ఘటికా! కాలానుసరణముగ నొక్కొక్కదానికొక్కొక్క విధివిధానము చొప్పనఁగలుగు మాన్పనకు భీతిల్లి కులమున కపయశంబుఁగలుగుదారిఁ బ్రవర్తిల్ల నగునా?

ఘటికు — అపయశంబని కండ్లకగపడుగోతిలోఁ బడుటకెవ్వరిచ్చగింతురు? బ్రతికి యుండిన బలుసుకూరయైనఁదిని సుఖములఁ బడయవచ్చునను సామెత నెఱుంగవే? లంకాపట్టణముదుస్థితిఁగాంచినంతనే నీవేమనిన నొప్పుకొందునుగాని నాకు బెదరు గదురుచునే యున్నది

శుచి — ఎవ్వరో యుపాయములేని పందలు మూఢబుద్ధి నారాము నెదుర్కొని అపాయమునుఁ బొందినారన్న మాత్రమున మాయాగుణ విశారదుండగు మైరావణుని యనుచరులమై మాయ మర్మ మంత్ర తంత్రంబులకు బ్రహ్మకాయలమై యుండి మనమా మనుజుల నెదుర్కొన వెనుకాడ సరసమగునా ? వారు మన మాయలఁగనుఁగొన శక్తులగుదురా ? ఏమి నీ వెఱ్ఱితనము ?

ఘటిక — నాది వెఱ్ఱితనముగాదు. నిజము నీకింకను తెలియదాయె ! మేఘనాధుని కంటె మన మెక్కుడు వారమా! అట్టివారలే హతులైయుండ మనలెక్కయేమి? అబ్బా! ఆరాముని బలమెట్టిదో గురుతింప బ్రహ్మకైన శక్యముగాదని తోచుచున్నది.

శుచి — చేతఁగానివాఁడవు చేతగానట్టువారుకొనక నీ పిఱికిమందితరులకుఁగూడ నేల ప్రయోగించెదవు ? నరులు — వానరులు — మేటిమగలని సిగ్గువిడచి నా మ్రోల నేల నిర్భయముగా వాగెదవు.

ఘటి — ఎవరిపిచ్చి వారికానందమన్నట్లు నీ భ్రమ నిన్ను వీడకుండుటఁజేసి ధీరత చూప నింకను ముందడుగు వేయుచుంటివి గాని నిజమెఱిఁగిగాదు. ఆనరుల సామర్థ్యాలని చెప్పనోపదు. ముంజేతి కంకణమున కద్దమేటికనునట్లు నారి చేదములఁ గనులారఁ గాంచుచుండియు దురభిమాన చేతస్కుండవై పైకి లేనిధైర్యముల దెచ్చిపెట్టుకొని మాటలాడిన నొప్పుకొందునా ! ఎంతవారుగాకున్న — వారి బల సాహస ప్రభావము లెట్టివి గాకున్నఁ — గైలాసమునే యెత్తిన దశకంఠుడే భీతిల్లి మనమహారాజు సాయమపేక్షించునా ?

శుచి — ఓరి ! పిఱికిపందా ! పరులసాయమపేక్షించుట బలసాహసములు లేకగాదు వైరి శూరత్వ ధీరత్వములకు జంకిగాదు. ఎంతటి వీరాధివీరునకైన స్వవిషయములో నొక్కొక్కసారి బుద్ధి పెడతలఁబట్టుచు నూహలు తోచకుండుటఁ బరుల సాయమపేక్షింతురు.

ఘటి — అగుఁగాక ! ఇంతకు నీయలజడి మనకెందులకు ? మనకు వచ్చునదిగాని మనకేమయిన వచ్చునదియా ! ఊరక మనమేల ప్రాణములపైకి దెచ్చుకొనవలయు

అదిగాక నేనింటికడ పయనమగునపుడు పాపిష్ఠురాలు మాయింటిది తుమ్మినది. నేనది లక్ష్యపెట్టక బ్రతికిన తుమ్ము—బజారి తుమ్ము— పాటికిరావని యెంచుకొనుచు గుమ్మములోనికి వచ్చుసరికి నల్లనిపిల్లి యెదురయ్యె. నేనద్దానిని గూడ పాటిసేయక మఱిరెండడుగులు వేతునుగదా యెక్కడినుండియో గుడ్లగూబ వచ్చి నానెత్తిపైఁదన్నె. ఆ యపశకునముల కనుగుణముగా నీ లంకాపట్టణము యొక్కయు రావణుని యొక్కయు స్థితిఁజూచిన నామది బెదరు గదురుచు నే యున్నది.

శుచి.—ఇట్టిది చూడవలసిన శకునముల మగవాఁడు చూచుకొనవచ్చునటోయి! అంతగా కర్మవశమున నేదైనముప్పు సంభవించిన వీరపురుషోచితమైనదే యగుట సంతసింపనగు. కాక వెనుకంజవేసి చని యేమైన రావణుని చేతిలోఁ జిక్కఁగలమా?

ఘుటి.—(స్వగ) ఈ ముండకొడుకెట్టుల నన్ను వదలఁడు. అబ్బా! ముందు తోఁచదు నా పెండ్లామున కెవ్వఁడు నే? ఇప్పుడు వీని ననుసరింపకఁ బోతినా పైరావణునితోఁ జెప్పనెఁ జెప్పు కపటుఁడితఁడు. కానిమ్ము. ఎట్లును ధైర్యం బవలంబింపకఁ దప్పదు. (ప్రకా) మిత్రమా! నీయంతు దీయవలెనని యంటినిగాని నాకేటి భయము? ఆ నరుఁడు మనమాయోపాయంబుల నెఱుంగఁజాలఁడని నేనెఱుంగనా? అందు నాకంటె నీవెక్కువ మంత్రవాదివి. నా మాయలకు నీ మంత్రములు సానుభూతములైయుండ మనకుఁ జేయరానిదేమియుండును. ఇంక మాటలు చాలించి ముందుకాఁగలకార్యమేదియో విచారించుము. అ కనఁబడుచోటనే శ్రీరాముల శిబిరములుండినట్లు తోఁచుచున్నది. అందుఁబోయి విచారించుకొందము రమ్ము. (నిష్క్రమించుచున్నారు)

ఇతి విష్కంభః—

హనుమంతుఁడు నిర్మించిన కోటలో శ్రీరామలక్ష్మణుల నునిచి
చుట్టు కపిసేనలు పహరాయిచ్చుచుండ ద్వారమువద్ద
హనుమంతుండు కావలియుండి ప్రవేశించుచున్నారు.

సుగ్రీ.—హనుమంతా! ధీమంతా! నీ శక్తి కడుశ్లాఘాపాత్రము సుమీ!

చ॥ అరుదయి మూఁడ పొంపయి మ • హోత్తరశిల్ప కళాప్రశస్త చా
తురమును జూపునట్టిదయి • దుస్సహమై మఱిసాటిలేనిదై

కపులకి భేద్యమై మిగుల • భద్రమునై యలరారు కోట నీ
నిరుపమశక్తిచే నిచట • నిల్పితివంతిలో చోద్యమౌనటుల్

అసమాన మహాద్భుత శక్తిసామర్థ్యపరుండవు నీవుండఁబట్టియే యకించనులగు యీ కపుల కింతటి యశంబు గలుగ శ్రీరామచంద్రుని పాదారవిందంబులఁ గొలుచు నవకాశం బేర్పడె. లేకున్న మేమేడ ? ఈ మహానుభావుని యండ సంచరించుటేడ ?

హను — వానరనాయకా ! ఇదియంతయుఁ దమ యాశీర్వాద ఫలమేగాని నాశక్తి గాదు. నా యందలి వాత్సల్యంబున మీ యందతిశక్తిని నాపైనిడి నన్నొక్క పెద్దచేయుటచేత నేనును ధగుదునని తలనెత్తఁగలిగితిని.

సుగ్రీ — అటు గాదు. చూడుము.

సీ॥ ఆనాఁడు నాకయి • యర్థించి కృపతోడ
నిసకులు చెల్మి జేఁ • యించినావు
శతయోజనంబైన • సంద్రంబువడిదాటి
సీతవార్తలరాముఁ • జేర్చినావు
శ్రీరాము చెంతకుఁ • జేర్చివిభీషణు
గాంచి వానికిభయము మి • ప్పించినావు
మందులచే మూర్ఛఁ • జెందిన సౌమిత్రిఁ
బ్రాణంబులిచ్చి కా • పాడినావు
యోషలోకంబు లంనాను • జోడు లేని
వాలమునఁ గోటసృజియించి • పసుమతీశు
భక్తిఁగాపాడఁగలిగిన • యుక్తిఁజూపి
కపుల మర్యాదనిలుపఁగాఁ • గడిగినావు?

దేనికైనఁ బేరుమూదియుఁ గార్యనిర్వాహకత్వమంతయు నీదియునై యున్నది. నీవొక్కింత యేమరిన మాబలము లన్నియు వ్యర్థములగుచుండుట మాకుఁ దెలియదా ?

హను — కిష్కింధాపురాధీశ్వరా ! మీ నిర్మల హృదయ ఫలితమే నా యశస్సాకారమైనది. నిజముగా నేనకించనుఁడ. నిమిత్తమాత్రుండ.

సీ॥ సీతాసంప్రాప్తి • యేగాక శ్రీరాము,
పాదారవింద సం • పాదనంబు
కపిసేన ప్రోత్సాహ • కారణంబునుగాదె,
దాటగల్గుట వార్ధి • వాటముగను
అలవిభీషణునిర్మ • లాంతర్యబుద్ధియే,
రఘురాము సేవిత • సుఖమునిచ్చె
ఆసుషేణు సుమార్గ • మార్గిఁ జెప్పకయున్న
సౌమిత్రిఁ గాపాడ • సంభవంబె
అన్నిటికిని మీదుకరుణ నా • కమరియుంటఁ
బైన శ్రీరాము దయనాకుఁ • బ్రాప్తమగుచు
నాకుఁ దోడ్పాటు చేత నీ • నాటికీటుల
గార్యనిర్వాహకపు భాగ్య • గరిమఁ గంటి॥

ఏది యెట్లున్న నిది యొకరినొకరు పొగడుకొనుచు నుల్లాసపడు సమయము కాదు. నేటి విభీషణుని మాటల విని యుంటిరిగదా! అందుకు నెట్టి యేర్పాటు లొనరించితిరి. నేనిందుండి కదలుట కేమాత్రమవకాశము లేదు భారమంతయు మీపై బడినది.

సుగ్రీ—అంతయుఁ గడు శ్రద్ధతో నేర్పాటొనరించియుంచితిని. సుషేణ, ధూమ్ర, వీరబాహు సుబాహులను కొంతకొంత సైన్యములతో సుషేణుని దక్షిణపు వైపునను, వీరబాహు నుత్తరమునను, ధూమ్రునిఁ దూర్పుదిశను, సుబాహున్ఁ బడమటి పార్శ్వమునను గావలిఁగాయ నియమించి వారలపై నప్పుడప్పుడంగద జాంబవంత గవయగవాక్ష గంధమాదనాదుల నొక్కొక్కరినొక్కొక్క యర్ధయామము చొప్పున పహరా చెలాయింప నేర్పాటొనరించి వారలందఱిని హెచ్చరింప నేను పనిబూనుకొని మాయారావణుని చర్యలెప్పటికప్పటికి మన కెఱింగించుటకు విభీషణుని నియమించితిని.

హను—మంచిది. ఇప్పుడీ దెసకు మీ రేల వచ్చితిరి?

సుగ్రీ—అందందు నడయాడుచుఁ గపిమూకల హెచ్చరింపుచు నిపుడీ దెస నీ యుద్యానమెటులుంగవచ్చితి.

హను — సరసమాయె. సుగ్రీవ సార్వభౌమా! నేను యిక్కడనుండి కదలుటకు వీలు లేదనియు సర్వభారము నీపైఁబడినదనియు రెండవసారి హెచ్చరింపుచున్నాను. ఈరాత్రి యెట్లు సమర్థించుకొందువో! బహుజాగరూకుఁడవై సంచరింపవలయు. దానవులే మాయావులు. అందు మైరావణుండు మఱి పేరుఁబడినవాఁడట!

తెఱలో — ఓహో! కపులారా! హెచ్చరిక. హెచ్చరిక. శ్రీరామచంద్రుని కార్యానుకూలమున మీ తనువులఁబవిత్రములుగఁ జేసుకొనుడు.

ఉ॥ దుర్భరమైన రాత్రియిది • తోకనుద్రొక్కిన త్రాచురీతిగా
నార్భటవృత్తి దానవుల • హాన్నిశముల్ రఘురాముఁబట్టఁగా
దుర్భ్రమనుంట నేకరిశి • ద్రోహమొనర్తురో? మీరలెల్లరున్
నిర్భయవృత్తి రక్కసుల • నేర్పుఁగనుంగొను డప్రమత్తులై!

సుగ్రీ — అంగదుఁడా కపుల హెచ్చరించుచుఁ దనవిధాయక కృత్యము నేమరక మన దెసకే వచ్చుచున్నాడు.

ప్రవేశము:— అంగదుఁడు.

అంగ — వీరశేఖరులారా! మీరిద్దరిచ్చటనుంటిరా! ఐన నేనీదెస రానవసరములేదు. మఱియొక మారాదిక్కునకేగి కపుల హెచ్చరించివచ్చెద.

సుగ్రీ — కుమారా! నీస్వామికార్యనిర్వాహకత్వమెంతయు శ్లాఘనీయము. నీయట్టివానికి నేవేఱుగఁ జెప్పనవసరములేదుగాని యైన నొకింతఁ జెప్పనుంటి. ఏమంటివా! వానరులు కడుచపలస్వభావులు. వారు మన నేటియాపత్తును బూర్ణముగా నెఱిఁగియుండరు. నేటిరావణునిపలాయనమునువిని మనజయమునకుప్పొంగ తబ్బిబ్బులగుచు ముందుకార్యమును మించి ప్రవర్తింతురేమోయని సందియమగుచున్నది. ఇఁకదానవులచైదములు నీవెఱిఁగినవేగదా! ఎప్పుడేవిధముగా మనలమోసగింతురో యిదమిద్ధమని నిరూపింపవీలులేదు. సర్వభారము మనపాలఁబడినది. జాగ్రత్తను తొలంగరాదు. నేటిరాత్రి యెట్లువేగింతుమోయని భీతి వొడముచున్నది. రామలక్ష్మణులు నిద్రించుచున్నారు. వారుమేల్కొనియుండ మనము శ్రమపడవలసిన పనిలేదు. మనమీకార్యమును నిర్వహింపఁజాలక వారిని మేల్కొలిపిన మనదాస్యము వారికున్ననేమి? లేకున్ననేమి?

అంగ — తండ్రీ! మీరింత నొక్కిచెప్పవలయునా! నాకుమాత్రము తెలియదా! మన

శక్తినిగాంచిన దానవ్రుఁడెవఁడును యీప్రాంతకు రా సాహసింపఁడు. మైరావణుఁడెట్టి యంగకునికి యత్నించెనేమో? వచ్చినఁ బ్రాణములఁ బాయవలసిన వాఁడే గదా! వంటయింటికుందేలెందుపోఁగలదు.

హను:— అంగదా! నిజము. నిజము. శ్రీరామలక్ష్మణులు నిద్రాపరవశులగుట వారనిద్రకెట్టి భంగముకలుగునో యనుభీతిచేతను, యేదననేమి సంభవించునోయను భ్రాంతిచేతను మనప్రయత్నమున మనముండుటయవసరమని యింతయత్నముఁగాంచినారము గాని నీవనినట్లు ప్రాణములందాశగలవాఁడెవ్వఁడేని మనమిందుండుట తెలిసి యీ ప్రాంతమునకు స్వప్నమందైన రాయత్నింపఁడు. ఐననేమో మనజాగ్రత్తలో మనముండుటవిధి. కావున నీవును శ్రద్ధతోఁగపుల హెచ్చరింపుచు నానిర్మిత కోటచుట్టు పహరాయిచ్చుచు నప్పుడప్పుడు సంగతుల నాకెఱింగింపుచుండుము. ఇంకమీరందఱు మీమీపనులకుఁబొండు.

(అంగదసుగ్రీవులు నిష్క్రమించుచున్నారు)

ప్రవేశము:-జనాంతికమున ఘటికుఁడు, శుచిర్ముఖుఁడు.

ఘటి — శుచిర్ముఖా! చూచితివా! ఎంతలో నెట్టిబలముగు కోటను నిర్మించిరో? చీమలు, దోమలుగూడ దూరనశక్యంబైయున్నది. ఎటులలోనఁబ్రవేశింపవలెను? రామలక్ష్మణులనెటుల తేవగు?

శుచి— ఘటికా! నీవన్నమాటలు సూటిగనే కాన్పించుచున్నవి. శ్రీరాముని మహిమాతిశయములమోఘములు. ఎంతవాఁడుగాకున్న క్షణములోనింతకోటను నిర్మించుకొని గట్టిగా కాపుంచుకొనఁగలఁడా! ఓరీ! తొలుతనీతఁడిట్టు కాపుంచుకొను కారణమేమైయుండును? మన మైరావణ మహారాజుగారి యుద్యమమును గనిపెట్టినాఁడా యేమి! ఐన నది యెటుల తెలియఁగలదు? బ్రహ్మభేద్యమగు పాతాళలంకలో మంతనంబున మాటాడుకున్న మాటలు వీనికెటుల దెలియవచ్చె? అంతయుఁ జిత్రముగానున్నది.

ఘటి— నేఁజెప్పలేదా! మనమీ రాముని జయింపలేమనుట నీకిప్పటికైన స్థిరపడెనదా! మనయత్నములేమియు వీనికడసాగవు. రామలక్ష్మణులెచ్చటనున్నది గనుగొనుటయే దుస్తరముగానున్నప్పుడు వారిఁగొనిచని మహారాజున కొప్పగించుటెట్లు? పోనీ! ప్రయత్నమొనరించి వారిజాడల నరయుదమన్న నీప్రాకారమును దాటి లోనికరుగు నుపాయమెద్ది? మొదలు తుదలేక నొక్కవిధి భూమ్యాకాశంబులనంటియున్నది.

కుచి — ఓరీ! మర్కటకముల సైదములే కనిపెట్టలేకున్న మనదానవపౌరుష మెందులకో? వినుము. నీవుముక్కును నీయిష్టానుసారముగఁ బెంపవచ్చుండవుగదా! నీవు పాతాళము వఱకు బరువగు నీ దీర్ఘనాసికముచేతఁ ద్రవ్వి బొరియ నేర్పరచి సందుఁజేసుకొని లోనఁ బ్రవేశింపఁ బ్రయత్నింపుము. నేను గగనభాగంబున కెగసి దీనియంతముఁ గనుంగొని యక్కడినుండి నాదంతపటిమచే కొఱికిగోడనంతయు క్షణములో బిండిబిండిచేసివైచెదు. అప్పుడెటులఁ దప్పించుకొందురో!

ఘుటి — మంచియోచనఁజేసితివి. అట్లే గావింతము. ఈయుపముపలోనఁ బ్రవేసించితివా రామలక్ష్మణులు మనచేతఁజిక్కినవారలే! (అనుచు నాప్రకారము చేయ గడంగుచున్నారు)

హను — (కోట కదలుట నిరూపించి) నా యత్నములేక నకారణంబుగ నావాలము కదలుటకుఁ గారణమేమియో తెలియదు. విభీషణుఁడు నుడివినటుల దానవులు దీనిని భేదింపసమకట్టి గట్టియత్నములఁ జేయుచున్నట్లున్నది. గట్టి కాపున్న కపుల నేమరచి నిందువచ్చినవారల ధైర్యముఁ గొంతవరకు మెచ్చవచ్చును. కాదు. కాదు. దానవుల ధైర్యముగాదు. మావారి బుద్ధిమాంద్యమే వారికి ధైర్యమును గలిగించియుండును. కానిమ్ము. కపిసేనల శ్రద్ధాభక్తులఁ దదుపరి విచారించుకొనవచ్చును. ఇప్పుడు వచ్చినవారల భంగపఱచి నావలకుఁ బంపవలయును. (పూర్ణబలమునఁ దోక నదుముచున్నాఁడు)

ఘుటి — (జనాంతికమున) అబ్బబ్బా! ఎంతముణ్ణాకొడుకులురా మానవులు. ఎన్నినో కోటలఁగూల్చిన నాడీగల ముక్కును విఱుగఁగొట్టినాఁడు. ఈపరాభవమునకేనెట్లు సైరింతు? ఇతరుల మొగమెటులఁజూతు? (ఆలోచించి) కుచిర్ముఖుఁడేమైన గార్యమును సాధించుకొనివచ్చునేమో? వానికగపడితి నాముందుగ నేనవ్వను. వానియుదంతం బేగియువఱకు వానికంటికగుపడక పలాయనమయ్యెద. (అని పరుగిడుచున్నాఁడు)

కుచి — (ప్రవేసించి జనాంతికముగ) కటకటా! బలగర్వముచే ఘుటికునిమాటలఁ బాటిసేయకఁ బరువుగల నా నోటిపండ్లూడఁగొట్టుకొంటిని. నా పాటితరులకుఁ జెప్పుకొనుటకుగూడ వీలులేదు. కమ్మనినంబుల్లి నెట్లునమలుదు? ఘుటికుఁడు కార్యమును నిర్వహించుకొని వచ్చునేమో? వచ్చినాపాటునకు నవ్వకమానడు. వానికంటికగుపడకుండఁ గాలికిబుద్ధిసెప్పెదగాక! (అని పరుగిడుచున్నాఁడు)

హను — (స్వగ) రే! దుర్మార్గులారా! మీకుఁదగిన శాస్తిజరిగెనా? బుద్ధిఁ దెచ్చెనో

నిమగల నిద్రారకి రాకుడు.

తెరలో—కపులారా!

చ॥ గడపితిరయ్య రాత్రిరిస • గంబును మీరుపరాకులేక మీ
రుషుగని భక్తి శక్తుల న • యోక్తుల;నింకసగంబురాత్రి వే
గనుపవలెన్ సుమా క్రమత • కార్యనియోగులరై చు యిట్టు లే
వినువని శ్రద్ధ దాశరథి • వేసుకఁ జెందఁ బరాకు మీకు దే !

హను— (స్వగత)ఆహా! కపుల శ్రద్ధాభక్తుల విషయమై నేనన్యథా తలంచితి
వారల దీక్షా పరతంత్రత మెచ్చఁదగినదియే. ఇదే! కపుల హెచ్చరింపుచు సుగ్రీ
రాజేంద్రుఁడిటు వచ్చుచున్నాఁడు. ఇచ్చటి యుదంతం బాతని కెఱుకఁ జేసి తగ
శ్రద్ధతో నుండ హెచ్చరించెద.

సుగ్రీ— (ప్రవేశించుచున్నాఁడు)

హను— రాజేంద్రా! యుదంతములేమి? దానవుల జాడలెట్లున్నవి?

సుగ్రీ— ఇంతవఱకెట్టి విశేషములు లేవు.

హను— ఔరా! మీరెంత పొరబడితిరి వినుఁడు తెల్పెద.

ఉ॥ రావణునాజ్ఞచేఁ గుటిల • రాక్షసులిద్దఱు వచ్చి లోనికిన్
బోవఁదలంచి శక్తిమెయిఁ • బూర్ణప్రయత్నముఁ జేసి వారమున్
గావలెనంచు వేగదుఱ • గానది నేను గ్రహించి యటు బా
గావగఁ జెందఁ బల్మిమయి • గట్టిగ నొక్కితి వారు ద్య మొందఁగా !

తత్ఫలితము వారనుభవించిరే దెసఁ బోయిరో వారలయుదంతము తరువాతఁ దెలియరాదయ్యె. కావున దనుజులమాయలు కడుచిత్రములనుట యిప్పటికైనస్పష్టమయ్యెగదా! మీరుఁ బరాకులేక శ్రద్ధతో నుంటిరిగదా యని నేనుకొంచెమే మఱియున్నచోఁ గష్టము సంభవించియుండునుగదా! మనమెంత జాగ్రత్తలో నుండినను మనకెవరికిఁ దెలియకుండ దుష్టకార్యాశక్తులు రాక్షసులు లోనే వచ్చిరిగదా!

సుగ్రీ—ఎంతవింత! ఎంతవింత! మందబుద్ధులము మేము వారిరాకడను గని పెట్టలేకపోయితిమి. ముప్పేమియును సంభవింపలేదుగదా! మా యజ్ఞానమును సైరింపుము.

హను—అయ్యా! మీదోషమేమియు లేదని నేనెఱుంగనా! మీరు పొరబడితిరన నోపుదునా? అనిదనుజుల మాయలు. వానినిఁ గనిపెట్టుట బహుదుస్తరమగుట మఱింత హెచ్చరికతో నుండ వేడుచున్నాడ

సుగ్రీ—వేఱుగఁ జెప్పవలయునా! ఆదెస కేగి యుదంతంబారసి వచ్చెద. విభీషణుఁ డెక్కడ?

హను—ఇప్పుడిప్పుడే యిందువచ్చివెళ్లినాఁడు. నీవీ దారినఁబోయిన వానిఁగలుసు కొనఁగలవు, పొమ్ము. జాగ్రత్తసుమీ! ఇదిమిక్కిలి గండమైనరాత్రి. ఎట్లుసమ ర్థించుకొందుమో? ఏవిధి శ్రీరాముని కరుణకుఁబాత్రులమగుదుమో?

సుగ్రీ—ఆలాగే. (అని నిష్క్రమించును)

(అపనికపడును)

:o:



శ్రీ రస్తు

# శ్రీ హనుమద్విజయము.

## చతుర్థాంకము.

—: పాతాళలంకలోనియుద్యానవనప్రదేశము. :—

ప్రవేశము :— దశముఖుండును విదూషకుండును.

విదూ.— (స్వగ) అకటా! లంకాధీశ్వరుండగు దశకంఠుని కార్యములొక్కటియు నాకుసరిపడనివగుటచే నెప్పటి కప్పటికి గుండెకుదురుపాటు చిక్కక నష్టైశ్వర్యము లనుభవించదగినస్థితి లభించినను స్వస్థతగా ననుభవించుప్రాప్తి లేకుండుటచేఁ గష్టముమీదఁ గలమాన్నంబు లారగించుటకంటె నేదిగులును లేక స్వస్థతతో గంజికూడైననదిని బ్రతుకుట భాగ్యంబనిచెప్పు పెద్దల నీతివచనంబులు జ్ఞప్తికిరాగా "బ్రతుకుజీవుడా" యని నా దుర్మిత్రుని కొలువుఁజాలించుకొని యీ పాతాళ లంకేశ్వరుండగు మైరావణునిపంచకుఁజేరి నాతనిప్రాపునఁ బడసి క్రమక్రమంబుగ నా బుద్ధి కుశలతచేతను వాగ్నిపుణత్వముచేతను నీ మహారాజున కాంతరంగికుఁడనై—వేడుక చెలికాఁడనై— ముఖ్య సచివుండనై కొంత కాలంబు నుండి సుఖముగా నేదిగులులేక జీవింపగలిగితినని సంతసించుచుంటినిగాని నా భాగ్యము దౌర్భాగ్యమైనకతన నినుపగజ్జెలతల్లి నా కంటెముందుగఁ గిజ్జుచెప్పులఁ దొడుగుకొని తందనాలాడుచు ముందు నాకు దారిఁజూపుచుఁ బరుగులిడుచుండ స్వర్గమునకేగినను విడియాకులు దప్పలేదనినట్లు నేనెక్కడికేగిన నక్కడ నాకు జగలుకూడేయగుచున్నదిగాని సౌఖ్యము గనఁబడదాయె. ఔరా! ఈ రావణుని జన్మకాలమహిమ యెట్టిదోగాని తాఁజేయు కార్యములందన్నిటఁ బనకపజయమే కలుగుచున్నను సిగ్గువిడచి మొండిధైర్య వరగర్వంబునఁ గన్నుఁగానక నెప్పటి కప్పటికేదియో సంకల్పించుకొనివచ్చి తన కర్మంబను దనతో బోసీయకుండఁ బరులపైకిఁగూడ బ్రయోగముఁజేసి పీరావేశుఁజేయుచుండును. అలనాఁడు

శూర్పణఖ వాక్యానుబద్ధుఁడై సీతాపహరణకార్యంబునకుం గడంగునాఁడే తగదని విన్నవించితినిగాని నా మాట సరకు సేయకఁబోయి వెంగలితనంబున నా యంగనామణిని దొంగిలించుకొనివచ్చి తుదకింతభంగపాటునుబొందినది చాలక నింక నా రాముని సాధింప నేమేమియో దొంగమార్గములాలోచించుట దైత్యాధముని గర్వమందునా? వెఱ్ఱియందునా? కాలకర్మమందునా? కాక వానినొసటి వ్రాతయందునా? ఏదైననా కేమిగాని యినుముఁగూడినయగ్నికి సమ్మెటవ్రేటు లమరినట్లా రావణుని కతంబున మైరావణునకునుఁ దన్మూలంబున నాకునుఁగూడ ముప్పు సంభవించునట్లున్నది. మంతనంబునం బిలుపించుకొని యా రావణుండేమి కల్లబొల్లి యేడ్పులేడ్చెనో—యేమి మందులు నూరిపోసెనో—ఆమందులప్రభావంబీ మైరావణుని తలనాటి యీ కాని కార్యమునకు గడంగినాడు. ఇప్పటికైన నీ మైరావణుండూరకున్న బాగుండు. అయ్యో! ఏలవూరకొనును. లంకనుబుట్టిన వారు రాక్షసులు గాక దేవతలగుదురా? కుమ్మరివాని ఆవమునఁగుండ బొచ్చెలు గాక యిత్తడి ముక్కాలుదొరకునా? దనుజకులంబున బుట్టినఁ ప్రతివానికిని కామరూపులమనియు—బలదర్పోపేతులమనియు—మాయా మంత్ర తంత్ర విశారదులమనియు గర్వంబు రోమ రోమంబున నిండి నిబిడీకృతమైయున్నది. అందీ మైరావణుఁడు మొట్టమొదటివాఁడు. బాహాబలాఢ్యుఁడగుట నిజమే. యుక్తిపరుఁడగుట యదార్థమే— కార్యనిపుణుఁడగుట వాస్తవమే—మాయా మంత్ర తంత్రజ్ఞుఁడగుట సత్యమే—కానికొంచెము యోచనాశూన్యుఁడు. ఉబ్బెత్తులమారి వాఁడు—అత్రిపరుఁడు—తనకెంతతోచునో నంతియేగాని హితుల హితమారయు వాఁడుగాడు. అయ్యో! నిష్కారణముగా రారాజును దూరనేల? నేనుమాత్ర మట్టివాఁడనుగానా? రాక్షసకులమునకంతకు నది మొదటినుంచియునుండిన మాయ తెగులే!—అందిరావణద్వయము వరబల గర్వితులగుటవారలకుఁబట్టుదలయుండుట యబ్బురమా! నా భయముకొలఁది నేననుకొనవలసివచ్చినది. భయపడిన నేమి లాభము? అనుకొనిన నేమి ప్రయోజనము? అక్కటా! ఎదుర్కొనబోవువాఁడు సామాన్యుఁడందమా? కాదు. దనుజకుల సంహారుండగు రామచంద్రుఁడు. అట్టివాని చేతిలోఁబడి నేనుగాని మైరావణుఁడుగాని మరలివచ్చుట కలలోనివార్తయే యగు. కూర్చొనబెట్టి యూరక వేతనములిచ్చుచున్న నెట్టిటోపీలఁబెట్టుక సెగిరిపడుచు సాధుల బాధించి పొట్టబోసుకొనుచు రణమునకు రమ్మనిన రాజీనామ జెట్టఁజూచు రక్షకభటుల చందంబున నా కిప్పుడీ యుద్యోగము వలదన్న రావ

ణుండు విశ్వసింపఁబోడు. ఈ వృత్తాంతము మతంగీదేవిగారికిఁ దెలిసెనో లేదోగాని తెలిసియున్న నింతవఱకు రాదు. ఆమె మహాసాధ్వి— యుక్తాయుక్త విచారకర్త్రి పరమ పతివ్రతయగుట మైరావణుండామెకు జంకుచుండును. సామాన్యముగా నా తల్లి వలదనిన కార్యమెట్టిదయినఁ దెంపరియై చేయ సాహసింపఁడు. అంతగాఁ జేయ నిష్టమున్న రహస్యముగా నామె చెవి కెక్కనేమో యని పరుల సాయముఁ గోరక నొనర్చుచుండును. అప్పుడు మాబోటివారలకు కొంత శాంతి చిక్కు. కావున యీ వృత్తాంతము నాశక్తివంచన లేక మతంగి చెవి కెక్కునటులఁ జేసితినా బ్రతుకనగు. ఇప్పుడు మించినది లేదు. మహారాజు నన్ను పలుపించిన కార్యమెఱింగి వీలునుఁబట్టి చూచుకొందును. దైత్యవర్యుఁడుద్యానవనమందున్నట్లు సేవకుఁడెఱింగించె. అచ్చటికేగి వానిఁ గలుసుకొనియెద. (పరిక్రమించి) అడుగో! మైరావణుండు గోతిదగ్గిర కాచుకొని కూర్చున్న నక్కలాగున నాకొఱకే గాఁబోలు నిరీక్షించుచు వేదికమీద కూర్చొనియున్నాఁడు. సమీపించెదఁగాక.

(అనుచు నుద్యానవనమున శిలావేదికపైఁగూర్చొనియున్న మైరావణుని సమీపించి)

మహారాజా! జయము. జయము.

మైరా—మిత్రమా! వచ్చితివా? నీ కొఱకై నిరీక్షించుచుంటిని. ఇంతయాలస్య మొనరించితివేల?

విదూ— ఏమి యాలస్యమో! దైవమా! నేఁడు యిల్లుబయలుదేరినప్పటినుండియు వకేమాదిరి దుశ్శకునంబులొకదానివెంట నొకటి నాకు గనఁబడఁజొచ్చినవి.

మైరా— నేననుకొన్నట్లే యైనది.

విదూ—మీరనుకొనకేమి? దిగులా! విచారమా! రాజాధిరాజులుగదా! అన్నమున్న బండమీదనైనఁ బెట్టుకతిను సామర్థ్యము గలవారు. చావు వచ్చువరకు బ్రతుకువారు.

మైరా—మిత్రమా! నోరు మెదల్చిన గాలు మెదల్చిన శకునములు శకునములని పలుకుచుందువే; శకునములననేమి? అవెట్లు కనుగొననగు?

విదూ—బల్లిపతనము – కాకితీర్చుట గృధ్రమెగురుట – పిల్లి పోబడి—నంబిరాకడ— వెధవ వెడలుట – తుమ్ముట – దగ్గుట – యిత్యాదుల భేదపరివర్తనల శుభాశుభంబు లెఱుంగనగు.

మైరా—ఓయీ! ఎంతయవివేకము! ఎంతజ్ఞానశూన్యత!

ఉ॥ ఎల్లరకుఁ శుభాశుభము • లేర్పడఁ జెప్పెడిబల్లితానయై
చల్లగగాబులోఁబడిన • చందమునన్ దమచావుతామె యే
వల్లనెఱుంగ నేరువని • పక్షులు నక్కలు కుక్కలాతుదన్
గొల్లగజ్ఞానవంతులకు • గూర్పఁగఁజూచుట మంచిచెడ్డలన్॥

విదూ—బలే. బలే! రావణరాజా! నీవుగూడ నేటి నవనాగరికులలో జేరినవాఁడవేనే. మిట్టవేదాంతివేత్తవే? ఏమోయనుకొంటిని. మూఢులుకొందఱు పొట్టకూటికొఱకై పరదేశభాషలపాలఁబడి స్వదేశ స్వమత వేషభాషా మాచారదూరులై పురాణపురుషులమైతిమనుచు విఱ్ఱవీగుచుఁ బురాణములయొక్కయు బురాణేతిసారములయొక్కయు రహస్యమును గ్రహింపనేరక క్రిందుమీఁదగుచుండు వారలరీతి నీవును మెలంగిన నెట్లగునయ్యా! నీమంత్రశాస్త్ర ప్రవీణతయు నట్టిదేనా?

మైరా—శకునములవిషయమై నడిగితిగాక శాస్త్రములగూర్చి వాదించలేదు. శాస్త్రములెంత బలములైనవో నీవుమాత్రమెఱుంగవా?

విదూ—ఎఱుంగుదును గనుకనే శాస్త్రములపై విశ్వాసముంచినట్లు దానిలోనిభాగమగు శకునవిషయమున నమ్మవలసివచ్చినది. అమ్మనుతిట్టి అబ్బను బూజించువెకలినిగాను శకునములు నాకెప్పటికప్పటికందిచ్చినట్లు ఫలాఫలములఁ బుజువు నేయుచునేయున్నవి. చూడుము. మొన్న నన్నొకఁడు నిమంత్రణకుఁ బిలువఁగా వలసినన్ని గారెలు బూరెలు లభించునుగదాయని యుప్పొంగి వెంటనే బయలుదేరుసరికి నల్లని పిల్లియడ్డముగా వచ్చినదిగాని గారెల సంతోషముతోనున్న వాఁడనగుటచే లోకమునే మఱచియుంట నాదుశ్శకునము మాటఁ బాటింపక వెళ్ళిభోజనమునకుఁ గూర్చున్నతఱి ప్రథమకబళమందే మక్షికాపాలమైనది. అంతదానిఁదీసి నావలవైచి గారెలకొఱకెదురుచూచుచుండ నింతలో నాయింటిభాగ్యవతి నాయూహానెఱింగి కావలసినన్ని గారెలఁదెచ్చి పడవేసెను. కాని యందొకచిత్రము జరిగినది. చూచితివా! పాపమామె తొలుతి పంటకమునకుఁ బ్రారంభించినప్పుడు గదిలో దాచియుంచిన నేతి దుత్తకుమారుగా నాముదముకుండను దెచ్చి చూడక దానిలో నేగారెలవండినదఁట నేను విస్తరినిండ గారెలు పడినవిగదాయని సంతోషంబున గారెల వాసననుగనిపెట్టియు గనిపెట్టలేనిమతిభ్రమణంబున వకదానివెంట నొకటిని నెమ్మదిగా పట్టించితిని. కాని కొంతసేపటికి గడుపులోఁ దెమలి పూర్వాషాఢకు మొదలుపెట్టి పేగులుసహా జారిపడుటకు సిద్ధమై తలప్రాణముతోకకువచ్చినది.

యుందువు. ఆకార్యసాఫల్యముకొఱకే మనఘటక శుచిర్ముఖులు పోయి యున్నారు. వారీపాటికి గార్యము సాధించుకొని వచ్చుచునే యుందురు.

విదూ— రావలసినదే! రాదగినదే! ఇంతయోచనేల?

మైరా— ఏమో? ఎట్లుచెప్పఁగలము? అందువిషయమై నాలోచించుటకునిన్నుఁ రాఁ గోరితిని.

విదూ— పిలుపించితివి. వచ్చితిని. బాగున్నదిగాని రాజా! సింహద్వారములుండ నీదొడ్డికంతల దూరనేల? కొలువుకూటములుండ యీపురిబాహ్యోద్యానవనములేల? సింహాసనములుండ నీశిలావేదికయేల? మంత్రిసామంతాది పురోహిత బంధువర్గములు నీమేలుగోరువారెందరోయుండ వారినెవరిని రానింపక దొంగతనముగా ద్రాగమఱిగిన బ్రాహ్మణముండాకొడుకులు కల్లుపాకవెనుకప్రక్కన గుసగుసలాడుకొను మాదిరిగా నీరహస్యాలోచనలేల?

మైరా— ఓయీ! నేనిప్పుడొనర్పనెంచిన కార్యమతిరహస్యముగా నెరవేర్పఁదగినది. రెండవవాని చెవికెక్కఁగూడనిదగుట నిట్లొనర్చితిని. అందుముఖ్యముగా నాఁడువారల చెవిని జేరనీయరాదు. సంగతులెట్లున్న వారుముందుగా నమంగళముగా గంటఁదడిపెట్టుదురు.

విదూ— వయస్యా! ఆఁడుదానికి భయపడి నల్లాముధీరుఁడవు నెట్టియసాధ్యకార్యము నెట్లునెగ్గింతువు? ఆఁడుది కంటఁదడిపెట్టుట యమంగళమగునా? అదియేశాస్త్రములోనిది? వైద్యశాస్త్రానుసారముగఁ గంటిలోని జలుబునీరుపోవుట దేహారోగ్యమేగదా!

మైరా— మూర్ఖా! ప్రతిదానికి విరుద్ధమేనా? "కలకంఠికంటకన్నీరొలికిన సిరియింటనుండనొల్లదని" దానవవంశగురూపదేశమును నాలించవో?

విదూ— చాలులే! వెఱ్ఱిరాజా! నూతనకవులెవరో యమకమునకై యతిప్రాసలోపము లేకుండ నేర్చినయేర్పులను శాస్త్రములుగా పరిగణించి వానికైభయపడుదురె?

మైరా— నీవనినట్లమంగళముగాకపోయినను రహస్యము వెల్లడిమాత్రముగాకపోదు అందుచే గార్యహానియగును. నేనిప్పుడొనరింపఁబోవుకార్య మతి దుర్ఘటమైనది వైరులుసామాన్యులుగారు. ఇదివఱకే మనవంశనాశనమును గొంతవరకు గావించియున్నారు. అట్టివారలనేదేని మహోపాయంబున మట్టుబెట్టనూహించు నామార్గమన్యులచెవికెక్కిన క్రమేణ నది కోటదాటి నగరుదాఁటి వైరులకుఁదెలియక

మానగు. అచ్చట మనమాయలకుఁ బ్రతిమాయలనోర్వ మనవాఁడొకఁడు జేరి యున్నాఁడు ఇదియిట్టిపనివారికిఁ దెలసిన మనయత్నములు నిష్ఫలమగుటయే గాక వీఁడు మిక్కిలి మనప్రాణములమీఁదికిఁ గూడ వచ్చును.

విదూ — ఆరాదా పోగిలు! ఏన్నిచైత్యరోగము బ్రాప్తించునని దెలిసియుండియు దానినేతాఁ గబ్రయత్నించుటకంటె వెంగలితనమెందైననుగలదా? ఇంతయోచింపలేరా?

మైరా — ఓయీ! నేనన్నియు యోచించియే యీకార్యమునకుఁ గడంగితిని. నే నీవఱకే పయనముగావలసినవాఁడను గాని ఘటికాశుచిర్ముఖుల రాకన్ నిరీక్షించుచు నీయుద్దేశమునుగూడఁ గనుంగొని నా వెంట నిన్నుఁ గొనిపోవనుంటిని.

విదూ — ప్రయాణమగుటకేమి గాని తాము సెలవిచ్చినట్లు మన ఘటికాశుచిర్ముఖులసంగతి అమ్మశ్రాద్ధమో! అన్నశ్రాద్ధమో కనుగొనిన డప పోవచ్చును. ఇంతలో మానరహస్యములు యల్పవడునని భయపడుటకుఁ గూడ నవకాశము లేదు. గాని నాపలుకొక్కటిమాత్రమాలోచింపుఁడు. ఎఱిఁగియుండి చెప్పకుండినయెడల నా దోషమగు. వినకున్న మీదదోషమగు. ఏమంటిరేని వైరబలదర్పాన్వితుండని వానిచైదయులే వేనోళ్లఁ జాటుచున్నవి. గాని యతఁడు మనకిప్పుడు కట్టికీడు నొనరించినవాఁడుగాఁడు మనపేరైనను గూడ దలపెట్టలేదు. అట్టివానితో నిష్కారణముగ వైరమాపాదించుకొననెంచుట కడుంగడు శోచనీయము. పాముల కొల్లపోయి యదురుకొంటె చిచ్చును మనచేతులమీఁదుగ పెనయుంటిలో బెట్టుకొని పిమ్మట వెతగుందినట్లగును. సర్వమెఱింగిన నీకు నేఁజెప్పఁజాలను. ఇపుడు మీ యిష్టము.

మైరా — సంగడీఁడా! ఎక్కడనో అడుగుల చప్పుడు వినవచ్చుచున్నది. పరులెవ్వరైన మనరహస్య వృత్తమునుఁ గనిపెట్ట నిఁగురువచ్చియుండిరా? లేక నలవనితలంపుగా తిన్నడబాసివచ్చితివని మతంగి నన్నరయుచు నిచటికివచ్చియుండునా?

విదూ — అబ్బా! ఏమి బ్రహ్మాండము మునిగిపోవుచున్నదని సరససల్లాపములాడు ప్రాణనాయకి ప్రక్కఁబాసివచ్చితివయ్యా! వచ్చితివిపో మరల నింటికిఁబోకుండువని యామెనిన్ను వెదకుచువచ్చునా?

మైరా — నిజమే రాకపోవచ్చును గాని యీ యలికిడికేమికారణము?

విదూ — (నసుగుతో) ఏమికారణమా? దొంగకుఁ జీమ చిటుక్కుమన్నఁ బరులు తన్నుఁ బట్టుకొనుటకేవచ్చుచున్నారని భ్రాంతిబడునట్లు దొంగకార్యాసక్తతతో నుండిననీకు భ్రాంతి కలుగకుండునా?

మైరా — మిత్రమా! ఆవైపునకుఁబోయి విచారించవలెను.

విదూ — ఎవరిపిచ్చి వారికానందము. నే వలదననేల? ఆలాగే రమ్ము (అని యొకవైపు నిష్క్రమించుచున్నారు)

---

(మఱియొకవైపునుండి మాతంగి చెలికత్తెలతోఁ బ్రవేశించుచున్నది)

చెలి 1 — అమ్మా! ప్రతాపలంకేశ్వరుండగు మైరావణ మహారాజుగారి కర్ధాంగివయ్యుఁ గలఁగనినంతనే యింతదిగులొంద నగునా?

చెలి 2 — నిజము నిజము. నిద్రబోవువారికెల్లఁ గలవరింతలు రాకుండునా? సహజముగా గలుగుచుండు వానిగూర్చి పరిపాటిగ వెతలొందనగునా?

మాతం — చెలులారా! ఇంకమీరెగతాళి చాలించుఁడు; ఏమిచిత్రమోగాని నామనంబునఁ జెయ్యిడికలచినట్లేదియో చిత్తవిభ్రమము జనించుచు నన్నే పనియుఁ జేయనీయకున్నది. మాటికిమాటికి శరీరము కంపమొందుచుఁ జిరుచెమటలు గ్రమ్ముచున్నవి.

చెలి 1 — అమ్మా! కల తీరిష్టపడని మాకెఱిఁగించినదానికిఁదగు ప్రతివిధాన మాలోచింతముగదా!

చెలి 2. — అవును. అదయే దారి.

మాతం — చేడియలారా! ఇప్పుడు చెప్పలేను. కొంచెము కుదుటపరచుకొనినపిమ్మటఁ జెప్పెద.

చెలి 2 — ఆలాగే! ఇప్పుడు మించిపోయినదేమి? ఆనికుంజముచెంత విశ్రమించి సమాహితచిత్తవై మనసునుఁ గుదుటపరచుకొనుము. (అనియచ్చటికిఁదీసుకొనిపోయి విశ్రమింపఁజేయుచున్నారు)

(ఇంకొకప్రక్కనుండి మైరావణవిదూషకులు ప్రవేశించుచున్నారు)

మైరా — (జనాంతికముగ) దధిముఖా! వృథానన్నుఁ బరిహసించెదవుగాని యాచాయనుండివచ్చిన శబ్దమును వినియుండలేదా? వేడుకచెలికాఁడవగుట నిన్నుగద్దించుటకుఁగూడవీలులేకున్నది గాక మరియొకఁడైననూరకుండునా?

విదూ — (జనాంతికముగ) వయస్యుఁడా! కామిలారోగముగలవానికి జగమంతయుఁ బచ్చగానుండునట్లును మానరోగంబుతో మెలంగునీకు నన్నిటనను మానమే! ఐన రాజాధిరాజవగు నిన్నుఁ గాదనిత్రోయ నేల? (అనియిటునటు పరికించిచూచి) అమ్మయ్యో! వచ్చితిమి రాజా! (అని పరుగిడి కౌఁగలించుకొనుచున్నాడు)

విదూ—(జనాంతికమున రాజుతో) వేఱు కారణమేమి గలదు. త్రాగుబోతువాని స్నేహమును బట్టి త్రాగుటనేర్చుకొని కొంపలమ్ముకొని భ్రష్టులై యేడ్చువానిపగిదిఁ గామాంధుని మాయమాటలకుఁజిక్కి గర్వాంధుఁడవై కొంపమీఁదికిఁదెచ్చుకొనుచున్నాఁడనియేగదా !

మైరా—(జనాంతికముగ) ఆసంగతి నీ కెట్లు తెలియఁగలదందువు?

విదూ—(జనాంతికముగ) గోడలకుఁజెవులుండునని యెఱుంగవా ?

మైరా—(జనాంతికముగ) నీవనినదిగూడ యొకకారణమే గావచ్చును గాని ప్రస్తుతము గాదని నాయభిప్రాయము.

విదూ—(జనాంతికమున) అదిగాకున్న నేమిగా నెంచెదవు ?

మైరా—(జనాంతికమున వినుము.

చ॥ అనయము రాచకార్యముల • యందు నిమగ్నుఁడనౌచు దానిమై
త్రిపమదిలక్ష్య పెట్టనని • దీనతఁగుందుచు ; మీఁదుమీఁన కే
తనువిఁ యసాధ్యదాశికిని • దాళఁగఁజాలక నానిమిత్తమై
వనరుహనేత్రి యీవిధని • వచ్చెవటంచుఁ దలంతు మిత్రమా !

విదూ—(జనాంతిక) ఆబ్బా ! ఎంత చిత్రముగా మాటలాడుచుఁ బరువును నిలుపుకొనుచుంటివయ్యా ! పాపము నిన్నువిడనాడి క్షణమైన నిలువనేరక "మగడా" యనుచుఁ బరుగులిడిన దేమి ?

మైరా—(జనాంతిక)ఓయీ ! అందుఁజిత్రమేమున్నది? చూడుము.

చ॥ పరవనితాప్రసంగమునఁ • బొల్పడఁకుండఁగ ప్రేమ పెంపునఁ
గరుణనుజూచుచుండునిజ • కాంతుని యొక్కక్షణంబులేనిచోఁ
దరుణికి ఘోరకల్పముగఁ • దద్దయు దోఁచును గాన లోకమే
మరతురురో యుచుందురు త్రి • మాంబున హత్యలె జేసుకుంద్రుగా॥

విదూ—(జనాంతి) అకటా ! మంచిసారాంశమునే గ్రహించితివి. నీవెంచినది రాగ గియ్యాళిచర్యలు, నాథుని వశవర్తినిచేసుకొనుటకై పన్నెడిపన్నుగడలుగాని యథార్థములుగావు. వారల వగలాడితనమునకుభ్రమసి పురుషులు తరుణులకు దాసులై వారిచర్యలెల్లనిక్కవములని నమ్మి నోరెత్తనీకుండ వర్తింపఁజేయుచున్నారు. ఉత్తమ స్త్రీలక్షణములిట్టివి గావు. నాథుఁడుతనకెంతమహాపరాధము నొనరించినను దానినిఁదలఁ

చుకొనక తనపురాకృతముగా భావించి జీవితేశుని పైనలుగక దంబముగాఁ జెరువుల కు బావులకుఁ బరుగులు పెట్టక నాతనినే దైవముగా మదినమ్మి వానియడుగులకు మడుగులొత్తుట పతివ్రతలక్షణము. అట్టిభేదాభేదంబులను గనుఁగొనలేక తనయా కితప్పును దానెఱుంగకుండి భ్రాంతిఁబడుటలోకసామాన్యమైనది. కాక తెలుసు కొందమన్న నవకాశముండదు. అట్టియవకాశమేయబ్బినఁజేయుచున్న పంపాపం బవ కాపురంబులు మంటఁగలియక మానవు.

చెలి — అమ్మా ! చిత్తమునుస్వస్థపఱచుకొంటివిగదా ! వృత్తాంతమేమి ?

మతం — ఏమి చెప్పుదునమ్మా ? నాకన్నులయెదుట నొకభల్లూకము లెక్కలేనిచీమల పుట్టలం బెల్లగించి తనకాహుతిఁజేసుకున్నది.

చెలి — అమ్మా ! చాలాదుస్వప్నమేసుమీ ! కానీ పూజావిధానంబులచేతను దాన పాత్రంబులచేతను నీయమంగళముప్రతిహతముకాఁగలదు. త్వరగా గాళికాలయమున కరుగుదము

మతం — చెలులారా ! నాయంబిక నాకన్నులయెదుటనే పొడగట్టుచున్నది. వేఱునా లయమునకేగనేల ? మీరు లేగివలయు పూజాద్రవ్యములఁగొనిరండు ఇచ్చటనే పూ జింతెము

చెలి — అలాగేఅని (నిష్క్రమించుచున్నారు)

మైరా — (జనాంతిక) మిత్రమా! వినుచుంటివిగదా హృదయేశ్వరిరాఁగారణము. పూ జాద్రవ్యములఁగొనివచ్చులోపలనే దేవికిఁ బకరిగెదను. సిద్ధంచేయుందుము.

పరిజ — అలాగే ! మీతో నాకేల ?

చెలి — (పూజాద్రవ్యములఁదెచ్చుచు మైరావణునిఁజూచి తనలో) అమ్మా ! మైరావ ణుండేవచ్చియున్నాడు. దేవినియమమున కేదైనభంగముఁగలిగించునేమో ?

మైరా — (చెలినివారించి పూజాద్రవ్యములఁదాఁగొని మతంగి సమీపించి అందిచ్చు చున్నాడు)

మతం — (మతంగిభక్తిపరవశయై వెనుకఁజూడక పళ్లెరమును పట్టిపట్టకయున్నది)

మైరా — (పళ్లెరమునువదలుచున్నాఁడు)

మతం — వెనుకఁజూడకయే కోపములో) ఏమి! పరిజనునకింత మైమరపా?

మైరా — దేవీ ! ఈ పరిజనుఁడిట్టివంటికార్యముల బొత్తుగా చేతగానివాఁడేసుమీ ! వానిరాణివగుని ప్రత్యక్షమియుంచిదిద్దుకొనవలయును.

ఉ॥ సారసనేత్రిరో! విను ని • జంబుగఁ దావక సేవకుండయో
నేరఁడు మంచిచెడ్డలను • నీకు సపర్యలఁ జేయుచుట్టువన్
నేరము లెంచఁ బోక దగుఁ • నేర్పున నీసికి బుద్ధి సెప్పి సం
స్కారవసిఁ జేయఁ జూడనగు • గాదె నుతాశ్వరి వేడఁ బోదుగా॥

మల్లి—(చిచ్చుపాటుతోఁ దనలో) హా! ఎంతయపరాధము?

మైరా—(ఎదుటఁ బడి ఆదరభావముతో) సఖీ! చిచ్చుపాటున కవకాశము లేదు. ధీరచిత్తనై యుండుము.

మతం—నాథా! అజ్ఞానంబునఁ జిత్తభ్రమంబున మీ యెడఁ గావించిన దోషంబును క్షమింపఁ బ్రార్థించుచున్నదాన. (చెలులను జూచి) సఖీమణులారా! మీరైన నాథుని రాక నెఱుంగఁ జేయలేకపోతిరిగా!

మైరా—ముద్దుగుమ్మలార! అమాయకులగు చేటీజనంబులపై నలుగఁ బోకుము. సఖీ! నిన్ను క్షమియించవలసినంతటి గొప్ప మేమి జేసితివి. ఇవి లోకసామాన్యమే గదా!

గీ॥ ఇలను నేకాంతపత్రిత • నేలునట్టి
రాజరాజైన దాసుఁడౌ • రమణికిడను
దాసజనులను దండింపఁ • దగినయట్టి
నిన్ను క్షమియింప నేటికే • నీరజాక్షి॥

విదూ—(ప్రవేశించి) అమ్మా! జోలిమాలినపనిఁ బైన వేసుకొని పెనగులాడు యీదాసుఁడ క్షమాపణార్హుఁడు గాఁడు. తలుపుచెక్కతోఁ దగినట్లు చల్లగ బుద్ధిఁ జెప్పుము.

మైర—(అపవారించి) మిత్రమా! నీ భాగ్యమారయె. ఊరకుండుము. నీ కెప్పుడు నోరు మాటలాడిన నాసలు వెక్కిరించుచుండును. పిదప కార్యభంగమగును.

విదూ—(బిగ్గరగా) చాలు లేవయ్యా! మాటిమాటికి విఘ్నము విఘ్నమని వేదురులాడెదవు. నేనేమంటిని? మాయమ్మతోఁ దుగ నీ ప్రయాణమునుగురించి మాటలాడలేదయ్యా! నీకు భయమేల? నన్ను వారింప నేల?

మైరా—(జనాంతికమున విదూషకుని బ్రతిమాలును.)

మతం—హృదయేశ్వరా!

గీ॥ నాథుఁ డెంతటి ప్రేమతో • నాతిఁ జూచు
చున్న. సతి కెంత స్వాతంత్ర్య • మున్నదాన

గర్వపడకను ప్రాణేశు ♦ గంటుసేతిర
దైవమిల లేడటంచును ♦ దలుపవలయు ॥

విదూ—అమ్మా ! ఆ పూర్వపుమాటలు ఇప్పుడట్లుగాదు. శక్తివంచనలేక సాధుని చేఁగాళ్ళు పట్టికొన్నగాని కాపురము సాగబోదు.

మైరా—తన్వీ! నీవలెనదేగదా యుత్తమస్త్రీలక్షణము ! నీయోగ్యత మెచ్చఁదగును. ప్రాణేశ్వరీ ! నేఁటివిధానమంతయు క్రొత్తగఁగనఁబడుచున్నది.

ఉ॥ పున్నమచందమామసరి ♦ బోలెడునీముఖబింబమేమొ
యన్నులమిన్న! రాహువిపు ♦ డాక్రమించె కళావిహీనమా
వెన్నెలలేనిచందమున ♦ విన్నదనంబొనగూడెగాదె నే
నెన్నఁడు సిగ్గువింతగను ♦ నేను నీయెడమున్న మానినీ ॥

సుమంగలీ ! నిన్నుఁజూచివచ్చి యొకగడియయుఁగూడ గాలేదే! ఇంతలోనిట్టివింతనుగలిగించినకారణంబేదియో యూహింపఁజాల ? (చెంతఁజేరి సమాశ్వాసింపుచు)

మ॥ చెలి! నీదుస్థితిఁజూడఁ జోద్యమగుచుఁ ♦ జీకాకునొందించె నా
నలఁతీ దోషమొ ? నీస్వయంకృతమొ ? నీ ♦ ప్రాణంపుచెట్టేజనం
బుల యజ్ఞానమొ ? కాక వేఱెతరమో ? పూర్ణస్వభావంబుతోఁ
గలతీర్లెల్లవచింపుమా వినఁగ నేఁ ♦ గాంక్షింతు బింబాధరీ ॥

విదూ—అమ్మా ! చల్లకువచ్చి ముంతదాచనేల ? కలసంగతిఁగిరవు జెట్టుము.

మైరా—(సహాసించి పెక్కులదువ్వుచు) కాంతా !

మ॥ అనుమానింపఁగనేల బాల? గనసీ ♦ యాంతర్యమే పాటిదో
ననురక్తిఁ బ్రతిమాలు ప్రాణవిభు నే ♦ యాలింపగాలేక నీ
మనమందున్న తలంపులన్ దగిలి ప్రే ♦ మాబంధముం వీడి హె
చ్చిన చింతాగ్నిదహింప జేతువటవే ♦ చెప్పంగ ఘటిల్లు దుః ॥

విదూ—అమ్మా ! ప్రతిమాలినకొలఁది బిగించకుము. అట్టి బిగదీసిన పుటుక్కునఁదగు నేమి ? మహారాజుగారేఁగవలసిన తొందరకార్యములు పెక్కులుగలవు. నీతో తడవుమాటలాడుటకుఁగూడ తరుణములేదు. హారుదాటిపోయినపిదప నీచింతఁ దీర్చువారెవ్వరు?

మైరా.—తరుణీ! ఏమట్లు బెంగగొని నిరుత్తరురాలవై యూరకుండెదవు? నీస్థితి నా మదిఁ గలంచుచున్నది. ఉన్నతీరెఱింగించి నాచిత్తశాంతినిఁ జేయఁ జూడుము.

విదూ.—(స్వ) అబ్బా! ఏమిమాయలవాఁడురా! కావుననే కాపురమును నెగ్గించుకొనుచున్నాఁడు. ఈతనికి యందినజుట్టు నందకున్న కాళ్ళు.

మతం.—నాథా! ఏమనివిన్నవింతును. ఇంతకుముందు మీరు నన్నువీడిచనినంతనే యకారణంబగుభయముత్పన్నమగుటఁ జేయునదిలేక తల్పంబుపై మేనువాల్చ పాపి నిద్రనన్నావహించె.

మైరా.—మంచిదే! పనులులేనివారికి నిద్రాదేవియేగదా ప్రాణసఖి! తరువాత.

మతం.—తరువాత నాకు గాఢముగా నిద్రపట్టలేదుగాని కన్నులుమాత్రము తెఱపిఁబడక నట్లే పండుకొనియుండ నాకొక చెడుకలవచ్చినది. ఒకభల్లూకము మననగరు ప్రవేశించి లెక్కలేనిసొమ్ముల పుట్టలఁ బెల్లగించి హతముజేసినది. ఇంతలో విభ్రాంతిదోచి లేచితిని. ఆస్వప్నవృత్తాంతమరయ కడుఘోరముగ మనసుఁ దాకుచున్నది.

మైరా.—తరుణీ! ఇందుకేనా నీకింతవిచారము? ఔరా! ఎంతబేలచిత్తవు?

చ॥ కలఁగనినంతమాత్రనె జ • గంబుసమస్తముఁ గ్రుంగినట్లుగా
వెలవెలబోవుచుంటివి • వేకులలక్షణమేతలంపుమా?
కలలుయదార్థముంచు బలు • కంగనువచ్చునె? నీవె చెప్పుమా
కలను లభించుసంపదలఁ • గాంతుమెతత్ఫలమందఁ జూచినన్॥

విదూ.—అమ్మా! అయ్యా! మీయిద్దఱియభిప్రాయములుసమంజసములుగావు. నిన్న స్వప్నంబునఁ గడుపారగారెల బూరెలఁదినినట్లును, అందుచేనజీర్ణముచేసియతిసారమేర్పడినట్లునుగంటిని. గానిలేచిచూచువఱకు గారెలబూరెలఁదిన్నగురుతుగా నాకుక్కినులకమంచముపాలైనది. కావున స్వప్నములు నిజమనిగానికావనిగాని చెప్పుటకువీలులేదు.

మతం.—హృదయేశ్వరా! నాచిత్తమును శాంతింపఁజేయుటకై తమరేమేమో చెప్పుచుంటిరిగాని అవి నాకుస్వస్థతనుఁ గూర్పఁజాలకున్నవి. ఆస్వప్నవృత్తాంతమట్లుండ నేనిచ్చటకువచ్చుటకుముందు మీ ప్రయాణసన్నాహమెఱుంగవచ్చుటచే మఱింతదీనురాలనైతిని.

విదూ.—ఎట్లూ! మూలుగునక్కపై దాటికాయపడినదే! పినరాణిగారికివిచారహేతువే!

మైరా.—(స్వగ) అన్నా! అనుకొన్నంతయేయైనది. ఈవేళనాకార్యమునకెట్టియాటంకము గలుగఁజేయునో? ఇట్టిసమయముల స్త్రీలకు స్వాతంత్ర్యమిచ్చి మెత్తదనమునుఁ

జూపుచున్న నెట్టి కెక్కుడైయే కార్యమునుఁ జేయనీయరు. కావునకఠినమానవులయు.
(విదూషకునితో జనాంతికముగ) మిత్రమా ! నా ప్రయాణముసంగతి దేవేరి కెవర
తెలిగించియుందురో ?

విదూ—నేనే మెఱుంగను బాబో ! అమ్మగారు నేయడిగి తెలుసుకొనుఁడు(స్వగత)కొం
పదీసి యీయాపనింద దేవేరి నాపైఁ బెట్టదుగదా ! ఏమో ! నాకర్మ మెట్లున్నదో !
కానిమ్ము. చూతము.

మైరా—కాంతా ! నా ప్రయాణముసంగతి నీకెవరెఱింగించిరి ?

మతం—జీవితేశ్వరా ! ఎవరెఱిఁగించిన నేమి? పతుల కెదురాడుట సతులకుఁ బాడిగా
దని శంకించియు నాసహజచేలత్వము నన్ను బాధించుటఁ జేసి సాహసించుచున్నా స
క్షమించి నేనర్థించుసుస్థానం బొసంగి నన్ను రక్షింపుడు.

విదూ—(స్వగ) అమ్మయ్యా! నాతల్లి కడుపుచల్లనిదగుటనీయమ్మ చక్కగఁ జెప్పించి
బ్రతుకఁగంటిని.

మైరా—తన్వీ ! నీ ప్రార్థన నేదియో వెల్లడింపుము.

మతం—మిమ్ము రావణుండు రాఁగోరెననిగదా నన్ను విడచి చయ్యన నేగితిరి! ఎందులకు?

మైరా—ఒకరాచకార్యవిషయమై నాతో మంతనంబున నాలోచించుటకు !

మతం—ఆకార్యమెట్టిదియో నే నెఱుంగవచ్చునా ?

మైరా—అదికడు రహస్యమైనదగుట నీకిప్పు డెఱుంగరాదు. రేపటిదినముదయమునఁ గాదు;
కాదింకొక్క యామములోపల నే నేఁ జెప్పెదను.

మతం—నాకడఁగూడ దాచవలసిన రహస్యములు మీకుండునా ?

మైరా—రాచకార్యములయందు స్త్రీలుపాలుగొనరాదు. కావున నీకాహాంశమనవస
రమని హెచ్చరించుచుంటిని.

మతం—ఆర్యపుత్రా! చల్లకువచ్చి ముంత దాచ నేలయనునట్లు నేనింకను వెనుకంజవేయ
నేల? హృదయేశా ! మీయుద్యమంబు సర్వంబు నామూలాగ్రంబుగ వింటిని. కాని
మీ భావమునకు వ్యతిరేకముగాఁ బలుకుట పాడిగానిపనియైనను నా యాందోళనము
నన్నుఁ బ్రేరేపించుచుంట సాహసింపవలసివచ్చినది. దానవనాయకా ! మనుజుఁడని
శ్రీరామునిఁ దగడి దశకంఠుని ప్రార్థనచేఁ బంతమూనుచుంబోతిరేని యాతనివలె
మనమును చింతనొందవలసినవారమగుదుము. ఆ శ్రీరాముని చరితంబులు వినిన
కొలఁది మహావింతలగుచున్నవి. మరియు నగ్నికి వాయువుతోఁడైనచందంబున
కరూపాక్ష ధూమ్రాక్షాది మహారాక్షసవీర ప్రాణాబ్జగంధేభులగు కపీంద్రులెం
దరో వానియనుచరులై వర్తిల్లుచున్నారఁట. కావున నామాటలాలించి యిప్పటి

మీయుద్యమంబు డిఁగి మీయర్ధాంగినగు నామాంగల్యమును సుమాంగల్యముగా నొనరింపుఁడు.

మైరా—తన్వీ! నీ తత్త్వహితోపదేశమంతయు ముగిసినదా! ఈవఱకు నిన్ను వీరవనితగా భావించుచుంటిని గాని వట్టి బేలవని నెఱుంగకపోతిని. నీవు నిజముగా మతిఁగివే నా? నేను మైరావణుండనే నా? మున్ను వచించిన కలవరింత నిన్నుఁ బాయలేదా?

గీ॥ భూతమేమైన సోకెనో? • బుద్ధిచెడెనో?
కల్లుద్రావుచు నుంటివో? • కాకమాయ
రావణాసుర ప్రాణంపు • దేవివీవు
కావో? యుచ్ఛ్రితమయ్యెగా • కిలికిమిన్న ॥

ఛీ! ఛీ! సకలజగద్భయంకర మాయారావణచక్రవర్తి కిల్లాలవైయుండియు బేల చందంబున నొకమానవాధముని గీర్తి సేయుచు నాయుద్యమ మనన్యథా ప్రవర్తింప నెంచినాకుఁ గాని హితోపదేశ మొనరింప నేర్తువే? చాలు నీసరసత మెచ్చవచ్చును!

మ॥ నరతుచ్ఛస్తవనాభిలాషివగుచున్ • నాముంన నిర్భీతిగా
మరియాదల్ విడనాడి బేలగతిఁ బ • ల్మారిట్లు వాదింపఁగా
సరియా నేచెలి! నాదు బాహుబలముల్ • శౌర్యాదిచందంబులీ
వెఱుఁగన్ జాలవె? అన్నియున్ దెలిసియే • యిట్లాడ నెట్లోపితో!

స్త్రీలకు స్వాతంత్ర్యమిచ్చి ప్రతిసంగతులు వారితో ముచ్చటించు నాబోటిపురుషుల యవివేకమునకుఁ జింతిలవలెగాక మిమ్ముఁ దూరినఁ ఫలము లేదు ఛీ! దనుజకులమునకంతకు నపయశంబబ్బ నీమాటలాలించఁదగినవి కావు. మారుమాటాడినచో నాకోపాగ్ని నిఁ బ్రజ్వరిల్లఁజేసినదానవగుదువు పొమ్ము.

మతం—ప్రాణేశ్వరా! పయిత్యరోగికిఁ బంచదారయుఁ జేదగునట్లు నేటికి నాహితముగూడ మీకు రుచింపదాయెగా! ఈవఱకెన్నఁడు నామాట జవదాటియుండని మీకు నాపయి నేఁడిట్టి యాగ్రహముఁ గలుగుటకుఁ గారణము నాదుష్ప్రాప్తియో కాలవైపరీత్యమో గావలయును. నామంగళసూత్రమహిమ యెట్లున్నట్లు గాఁగలదు. ఆఁడుదాననగుట బేలబుద్ధిని నట్టిహాగిన నమంగళమంబగు. మీరు తిరుగవచ్చి కంటఁబడు

దాఁక శాంకరీదేవి నుపాసింపుచు మీ విజయమునకై వేచియుండెద. నాకు సెలవిమ్ము.

మైరా— మంచిది. ఉత్తమసాధ్వీయాచరింపవలసినవిధమట్టిదయేగదా! పోయిరమ్ము.

మత— (నిష్క్రమించును)

మై— చెలికాఁడా! మంత్రనంబునకుఁగాలములేదు. నేవచ్చులోపల మీరెల్లరుఁ గాళీ పూజకుఁ దగుయత్నములొనరింపుఁడు.

దూ— అలాగే! (అందఱునిష్క్రమించుచున్నారు.)





శ్రీ

# హనుమద్విజయము.

## పంచమాంకము.

లంకాపురిలోని వెలుపలిభాగము.

ప్రవేశము మైరావణుఁడు.

మైరా.— (ఒంటరిగాఁ దనలో) తాటిచెట్టెక్కువాని తలఁదన్నువారుందురనుమాట నిక్కువమే సుమీ! ఘటికశుచిర్ముఖులవాక్కులు సత్యములుకావనియుఁ బిటికిపందలై దశకంఠునిస్థితినిఁ జూచి కలవరపడి యేకోతిచేతనో జిక్కి తన్నులఁదిని తప్పించుకొని ప్రాణంబులపైఁ దీపిచేతఁ బరుగిడివచ్చి గోరంతలఁ గొండంతలఁజేసి నాకడ వచించిరనియుఁ దలంచితినిగాని వారినుడువులు త్రోసివేయఁదగినవికావని నాకిప్పటికిస్పష్టమయ్యె. భళిరా! ఏమీ రామునిశక్తి? ఏమీయీకపిసేనస్వామిభక్తి? ఎంతపింతగనున్నది.

మ॥ నిరతంబున్ రఘురాముసేమమునకై • నిద్రాదిభోగంబులన్
మరపున్ జెందుచునన్యకాంక్షలను నే • మాత్రంబునాశింపకన్
బరమప్రీతిస్వకార్యమట్టులసదా • భావింపుచున్ వానరుల్
స్థిరతన్ సేవయొనర్చుచుండిరిగ భ • క్తిశ్రద్ధలింపొందగన్ ॥

ఎంతవారుగాకున్న నరులేడ? యోధానయోధుండగు రావణునిభంగపరుచుటేడ?

క॥ కడలిని గిట్టిన విధంబును
విడువకఁ గోటానకోట్ల • వీరులననిలోఁ
బొడచినవిధమును దలఁపగఁ
దడఁబడనొనరించుచుండె • ధైర్యంబకటా?

అట్టివారలతోఁ బ్రగాఢ్యమునుఁ బెంచుకొనుట నిజముగా రావణునివెఱ్ఱితనమే! తన నిజస్థితికి భంగమెదవినప్పుడుగూడ నక్కబిక్కములాడినఁ బ్రాణములు దక్కునే? అట్టితానొక్కనితోఁ బోకుండగనే జోలిలేనితదితరులఁగూడ చిక్కులఁబె

ట్టఁదలపెట్టినాడు. నరులు-వానరులని తృణీకృతభావముతో వెట్టిపనిగొడవఁ దెచ్చిపెట్టుకొంటిని. ఈ విచిత్రనూతనమయచమత్కృతియే వీరిసామర్థ్యమును వెల్లడిఁజేయుచుండె. ఔరా! ఎంతవింత ?

సీ॥ గగనభాగముకెగసి ♦ గావించినను గాని
యంతుఁజిక్కనికోట ♦ యెంతెత్తులదో ?
పాతాళమునదూరి ♦ పరికించినను గాని
పింపొందుచుపునాది ♦ యెంతెగలదో ?
ప్రాకారమును జుట్టి ♦ పలుమారు జూచిన
సందుగొందికనిచంద ♦ మెందుకలదో ?
పెట్టుఫిరంగుల ♦ కొట్టిచూచినగాని
సుంతకదలనిబలము ♦ దెంతకలదో ?
ఆరరే! నేరుపు చతురత ♦ నబ్బురంబు
నొందఁజేయుచు మిగులనా ♦ నందమయ్యె
మానవాధముచేదమో ♦ మయునిశిల్ప
చతురతయొగాని వర్ణింప ♦ శక్యమగునే!!

ఆహా! ఏమియీనిర్మితకోటవిచిత్రము. ఇదినిజముగాకోటయా? లేక నన్నుమాయలో ముంచివెనుకకు మఱలింపనెంచిచేసినజాటయా ?

సీ॥ కోటయాయిది? కాదు ♦ వాటమౌదుర్భేద్య
వజ్రనిర్మితసూత్ను ♦ పంజరంబు
ప్రాకారమా? కాదు ♦ లోకైకపూజిత
శ్రీకారయాకార ♦ చిత్రితంబు
కాంచనగర్తయా? ♦ కాదు కల్లోలిత
శాఖామృగగ్రామ ♦ సాగరములు
రామునైన్యము? కాదు ♦ రావణదుర్వార
శౌర్యనాశకమృత్యు♦ సంచయంబు

కాంచనరుఁడో కోరాముండు? • కాదు కాదు
శిష్టపరిపాలనార్థమై • క్షితితలమున
నవతరించిన నారాయ • ణావతార
మనెడివాక్కులు నిక్కంబు • లాయె నకటా!

వ్యర్థమైనఁగాని మృత్యు. నావిజయము నాకే సందేహాస్పదముగనున్నది. ఐన సాధ్యమైన యత్నములు సేయక వెనుకఁదిరుగఁబోఁగూడదు. అక్కటా! గొప్పచిక్కు సంభవమాయె. సురాసుర దుర్భేద్యంబగు నీకోటలోనికిఁదొలుతఁ బ్రవేశించుటెట్లు? (ఆలోచించి) మాకీచు?చందంబున మాయవేషధారినై వీరలమాయముంచి లోనఁబ్రవేశించిగదా మచ్చుఁజల్లి శ్రీరామలక్ష్మణుల మూర్ఛఁబుచ్చి గొనిపోవలయు? అదెట్లు సేయనగు? ఏవేషమూనిన వీరునమ్మెదరు?

తెఱలో— ఓహో! విభీషణాంగద జాంబవంతులారా! హెచ్చరిక. హెచ్చరిక.

మైరా— బలే! ఈకపులు నాకుఁజక్కనిమార్గప్రదర్శకులైరి. నా విభీషణునివేషమూని వీరల మన్మాయోపాయంబుల ముంచెద. (నిష్క్రమించుచున్నాఁడు)

(ఇది విష్కంభము)

———:o:———

(నిర్మితికోటవాకిటఁగావలిఁగాయుచు హనుమంతుఁడు
ప్రవేశించుచున్నాఁడు)

హను— (భక్తిపరవశుఁడై) ఆహా! శ్రీరామచంద్రుని దివ్యపాదారవిందంబులనమ్మి కొల్చువారలభాగ్యమే భాగ్యము! ఈజన్మసార్థకము.

సీ॥ కనులుగల్గుటకునీ • కాంచనాంబరుఁజూచు
ఫలముగానిమఱేమి • ఫలములేదు
జిహ్వగల్గుటకునీ • శ్రీరాముఁబొగడుటే
ఫలముగానిమఱేమి • ఫలములేదు
వీనులుండుటకునీ • విశ్వేశునినుటే
ఫలముగానిమఱేమి • ఫలములేదు
దేహంబుగల్గనీ • దేవేశుసేవించు
ఫలముగానిమఱేమి • ఫలములేదు

కిరణములుండుటకే రాము ♦ చరణయుగము
బూజసేయుచునుండు జే ♦ పూర్ణసిద్ధి
జన్మమెత్తిన దాసికి ♦ సారసాక్షు
దాస్యమొసరించు భేషలి ♦ తంబుగాక!

బలేఁ వట్టివానిఁ గూడ భ్రమింపఁజేయు శ్రీరామ తేజఃపుంజ మెంతని కొనియాడఁ గలను.

సీ॥ సౌందర్యసముదయ ♦ సంకేతమందిర
మనఁదగు శ్రీరాము ♦ తనువుఁ జూడ
సౌభాగ్యగాంభీర్య ♦ సదనమగు దివ్యస్త్ర [?]
లంబసితో ముని ♦ యనఘు యుగముఁ [?]
మాంగల్యలక్ష్యంబు ♦ మానసంబు తోను [?]
కమలంబు సాటియౌ ♦ ఘనుని మోము [?]
దయ యుశ్శృంగారంబు ♦ దాముఁ గాఁ గూడిన [?]
పుణ్యంపు తాపుల ♦ పురుషుకనుఁగు [?]
పుట్టిన హాసియా సుమార్తిని ♦ నింపుమాటి [?]
నపుడుఁగనుఁ గొనుచుండుట ♦ కెల్లయింద్రి
యములఁ గన్నులుగాఁ జేయు ♦ డా యొనలువ
తనిసి నిగుడ నారెంటికి జే ♦ గనినయంత ॥

మంచిది.

క॥ కామితఫలసంప్రాప్తికి
రాము చరణనళినరేణు ♦ రాజ యెడకన్
భూమీజనులకు సాధన
మేమియుఁ గనుపట్టఁబోవఁ - డెందునఁ దలఁపన్

లేదు. లేదు నిక్కంబుగా లేదు. ఔరౌరా! రామనామస్మరణ మెంతయానంద దాయకము? ఎంత సౌఖ్యప్రదము? ఎంత సౌభాగ్యయుతము? కావున నేసదా

దేవతలు, మునులు, జపించుచుందురు. అట్టి రామనామమును వర్ణించుటకు నాబోటి యల్పునకు సాధ్యమగునా !

సీ॥ ఘోరపాపాదపసం ♦ సారాటవినిఁ గాల్ప
రామనామము కుఠా ♦ రంబుగాదె
అజ్ఞానఘనతిమి ♦ రాంధంబు వదలింప
రామనామము భాను ♦ రశ్మిగాదె
పరభక్తి కల్యాణవార్ధి ♦ నుప్పొంగింప
రామనామము సోము ♦ రాకగాదె
పాపౌఘదుర్వార ♦ బంధంబులను ద్రెంప
రామనామము లవి ♦ త్రంబుగాదె
అఖిలశాత్రవస్థైర్య శౌ ♦ ర్యాద్రిఁ గూల్ప
రామనామము తగు భిదు ♦ రంబుగాదె
వసుధ భవరోగజనిత పి ♦ పాసఁ నార్ప
రామనామము పీయూష ♦ రసముగాదె ॥

అట్టి తారకనామోచ్చారణభాగ్యంబు, సేవానుకూలత నాపూర్వపుణ్యవశంబున లభించె.

ఉ॥ ధన్యుఁడనైతి రాఘవప ♦ దంబుల సేవనిశంబుఁ గొల్చుటన్
మాన్యుఁడనైతి నా సరిస ♦ మానులలోఁ గడు పెద్దనైతి నా
కన్యము లేదు భూవలయ ♦ మందున జన్మము ముక్తిఁ జెందసా
మాన్యులకందరాని బహు ♦ మానముఁ బొందితిఁ గీర్తిఁ జెందితిన్

(విభీషణవేషధారియై మైరావణుఁడు జనాంతికమునఁ బ్రవేశించుచున్నాఁడు)

మైరా — (జనాంతికముగఁ దనలో) సరి. సరి, ఈ వానరనరపశువులకు ధైర్యస్థైర్యము లెక్కడనుండివచ్చెనాయని సందేహపడితినిగాని పరికింపఁదయు కులనాశకుండను నగు రావణానుజుఁడు వైరియుండఁ జేరి మాకులమర్మంబుల నెప్పటికప్పుడు వారి కెఱిఁగింపుచుఁ దత్ప్రతీకారముల విశదీకరించుచుండుటచే వారికి విజయము చేకూరుచున్నదని నేటికిఁ గనుఁగొనఁగంటిని. లేకున్న బ్రహ్మకైన మామాయల నెఱుంగ

సాధ్యమగునా ? (విభీషణునుద్దేశించి) ఔరా ! దనుజఘాతకా ! కులవిధ్వంసకా ! అభిమానశూన్యా ! రావణానుజా ! విభీషణా !

చ॥ దనుజకులప్రభావమును • దగ్ధమొనర్పఁగ నాత్మగౌరవం
బును దలఁపంగఁబోక నర • పుంగవునొక్కనిఁ శ్రేష్ఠుఁడంచు మె
చ్చిన తమినాశ్రయించి మన • చేవనశింపఁగ నెల్లమర్మముల్
వినుతిమొనర్చితట ! వి • భీషణ ! పుట్టినవంశనాశనా !

కానిమ్ము. నీబోటి యధమాధముండొక్కఁడు దుర్వృత్తినిసంచరించినంతసర్వనాశనమైనదనుకొంటివా ? మూర్ఖా ! అట్లుదలంచుటకూడ నీబుద్ధిమాంద్యమే.

ఉ॥ నీయనుజుండు దుర్భ్రమను • నిల్చిశ్మరార్భటిమీఱలేక నే
సాయము లేకఁ దా దనుజ • సంతతిఖ్యాతినిఁ గూల్చెఁగాక క్రూ
రా ! యవినీతి చిత్త ! మయి • రావణుఁ డిప్పుడు వచ్చెనిన్ను నీ
నాయకునిన్ వధించుటకు • నన్నెటు తప్పుకొనంగ నేర్తువో ॥

ఛీ ! ఛీ ! దనుజకుల ఖండాలా ! కులాభిమానమైనగణింపకఁ బ్రాణంబులపై నాశచే నీతులుపదేశించు నెపంబున నగ్రజునిచే నిరాకరింపఁబడి వైరినిశరణంబు వేడిన ప్రాణంబులను దక్కించుకొంటివా ! అభిమానశూన్యా ! మానముకంటెఁ బ్రాణంబు హెచ్చటరా ! లోకంబున నన్నదమ్ములని విశ్వసించుట నిరర్థకంబని నేటికి నీ వలన రూఢియయ్యె. సరే ! ఇప్పుడు సాధించినదేమి ?

చ॥ అరనిముసంబులోన మిము • నందఱిఁ ఘోరవిపత్సముద్రమం
దరమరలేకఁ ద్రోసి విజ • యంబుపయిన్ భ్రమవీడఁ జేసి మీ
నిరుపమశక్తిసంపదల • నీరసపుచ్చి ప్రగల్భనాశమున్
విరివిగఁ బొందఁ జేయును వి • భీషణ ! ఈ మయిరావణుండిదే ॥

ఇంద్రజాల, మహేంద్రజాల, టక్కు, టమార, గజకర్ణ, పరకాయ, మహామాయ, జలాగ్నిస్తంభన, మొసకట్టు, వాకట్టు, రయస్తంభన, వశ్యాకర్షణ, విద్వేషోచ్చాటన, సంహారణ, గాలవంచన, పక్షిగతిభేదన, యోగవాదన, నంజిన, భేదన, ధృతివిశేషవంచన స్వరవంచనలను మంత్రతంత్రవిద్యలందసమానమేటినగు నీ మయిరావణుం బారిఁబడినవారెవ్వరీవఱకు తప్పించుకొనఁగలిగిరి.

ఉ॥ పెక్కు వచింపనేలర వి • భీషణ! యో రఘురామ! లక్ష్మణా!
చిక్కితిరింగుచుంటి నలుఁ • జేరినకుంజెలురీతి పాపినై
టక్కరి రావణానుజుఁడ • నావుడి బోధనలంది యింక మీ
రెక్కడికేఁగఁగాఁగలరు • యీ మయిరావణుచేతఁ జావకన్!

అకటా! రోషభీషణుఁజాజ్వల్యమానసుఁడనయి చేయవచ్చినకార్యమును మరచి మంచిచెడ్డలనెంచక వృథాకాలయాపనముఁ జేయుచుంటిని. అక్కటా! రోషమెంత చెడ్డది?

గీ॥ మంచిచెడ్డలనఁగుమాత్ర • మెంచనీదు
చేయఁగఁ దగినకార్యంబుఁ • జేయనీదు
కష్టసుఖములనావంతఁ • గాంచనీదు
తలఁప రోషమనర్థసం • ధాయకంబు॥

ఇఁక నాలసింపకఁ గార్యాభిముఖుఁడనయ్యెద. (యోచించి) ఇదెట్లు సేయనగు?

ఉ॥ ఇత్తఱి భీమరూపబలుఁ • డెవ్వఁడొ వాకిటనిల్చి భక్తిమైఁ
జిత్తము రామపాద సర • సీరుహమందునఁ జేర్చి మీఁదలో
కోత్తరమైన రాద్రిరస • మూరక దా వెలిఁగ్రక్కుచుండఁగా
బిత్తఱిచూపుఁ జూచుచుఁ బ్ర • వీణతఁ గావలిఁగాయుచుండెఁగా!

వీఁడెవ్వఁడో? ఆకారమునుఁ జూడ మహాబలతేజశ్శాలియని చెప్పకయే చెప్పుచున్నది (ఆలోచించి) అతఁడే కావచ్చును!

సీ॥ కాఁబోలు వీఁడు యీ • కాకుత్స్థసైన్యాధి
పత్యంబుఁ గైకొన్న • బలయుతుండు
కాఁబోలు వీఁడు లో • కాళి మెచ్చఁగ ఘోర
వార్ధి దాటినయట్టి • వనచరుండు
కాఁబోలు వీఁడు లం • కాపట్టణంబును
దోకతోఁ గాల్చిన • దోర్బలుండు
కాఁబోలు వీఁడు ప్ర • ఖ్యాతశౌర్యస్ఫూర్తి
దనుజులఁ జంపిన • ఘనబలుండు

నీఁ దౌకాఁ బోలు జానకీ ♦ జాడఁ గాంచి
యుద్ధసన్నిద్ధగానిద ♦ మిద్ధముంచుఁ
జేసె రావణుబలముల ♦ జిత్రగతులఁ
బట్టి చెండాడి వైచిన ♦ బాహుబలుఁడు ॥

వీనియీ కార్యముఁ జూచిన వైరిదములఁ దలఁచిన నాశక్తిసామర్థ్యంబులన్నియు మరి పునరుపచ్చి నన్నుఁ బిరికివానిగాఁ జేయుచున్నవి. ఏమైనఁగాని యిప్పుడు (సమీపించి.) పలుకరించెదఁగాక! (సమీపించి) వీఁడెవ్వఁడో తెలియక నెట్లు సంబోధింతును? ప్రమాదము వచ్చినఁ బ్రాణహానియగును. (ఆలోచించి) హనుమంతుఁడను వాఁడొ కోటను నిర్మించి వాకిటఁ గావలియుండెననిగదా నాభటులు నాకెఱింగించిరి. ఇట్లు పిలిచెద (ప్రకాశముగా) హనుమంతా!

హను—(హనుమంతుఁడు పలుకక రచ్చపకను)

మైరా—(స్వగ) వీనిరిచ్చపాటుఁ గాంచిన వీని నామ మిదియేనని స్పష్టమగుచున్నది. కాని భక్తిరసమగ్నుండై దేహముఁ దెలియకున్నాఁడు. వీనిని మాయఁ గప్పుటకు మంచి సమయము తటస్థించినది (ప్రకాశ) పవమానతనయా! ఇకిది యేటి వెఱ్ఱి?

ఉ॥ భ్రాంతినిఁ బొందినావొ? మధు ♦ పానముఁ జేసితొ? నిద్రఁ జోఁపుచుంటె
వింతగఁ గల్వరించెదవొ? వి♦వేకముఁ బాసితొ? పిచ్చియెత్తెనో?
వంతలఁ జిక్కియున్న రఘు ♦ వల్లభురక్షణ వీటఁ బుచ్చి స
స్వాంతమునం దిభక్తిరస ♦ వారిధి ముంచెదె బుద్ధిహీనతన్ ॥

ఎక్కడి భక్తిరసము? ఎక్కడి పాపము?

క॥ సరిలే బాగాయెను నీ
చరితము ; రఘురాము కార్య ♦ సంపుష్టిని నే
మరపుఁ బొందుచు నిపుడు
తెలుఁగు నవస్త్రంపసగునె ♦ ధీరవతంసా!

దేనికైన దేశకాలపాత్రంబులుండవలదా!

హను—(భక్తిరసమగ్నుండయ్యు నించుకస్మృతి నభినయించి) ఓయీ! నీ వెవఁడవు? వెఱ్ఱివానివలె గెల్పట్టుచున్నావు. రామనామామృతపానమునకుఁ గూడ దేశకాల పాత్రంబులు కావలెనా! శ్రీరాముని మహిమలు వర్ణింపనలవియా? వినుము.

క॥ శరణార్థులైన వారికి
శరణము, దుర్మార్గజనుల • సంహరణజయా
భరణము, భానుని వంశో
ద్ధరణము, శ్రీరామునాము • తారకమునరా ॥

మఱియు

క॥ శ్రీరాము పాదపంకజములఁ
గోరుచు శిరముపయి • మోపికొల్లగ మదిలోఁ
జేరిచితి న్నామము నే
మారక దలఁచినను ముక్తి • మార్గముగాదె ?

అట్లగుటనో మాతా !

సీ॥ కామధేనువు మన చెంతఁ • గాచియుండు
వేళఁ బాల్గాలియూ మూద • విచ్చుకొత్తు
కోనఁగి నూహించుచుందాన • మనుజపతినిఁ
గొలువకుండుటయోగాదె • తులువ ! తెలఁప !

నిన్ను చూడ మాయకుని వలెనున్నావు. రామనామస్మరణకు దేశకాలపాత్రంబు లుండవలెనని పల్కెడు నీ చరిత్రము యనుమానాస్పదంబును నిందార్హము గానున్నది.

అక్కటా!

ఉ॥ నిక్కపు రామభక్తి మది • నిల్వదొ ? జ్ఞానము నుంటఁ గల్గెనో
ఎక్కువ కల్లుఁ ద్రాగఁగయి • పెక్కెనొ ? వానరవంశమందు నీ
వక్కట! పుట్టినావొ? గనన • యారె ! యిట్ల్ నను మోసపుచ్చ నీ
చక్కికి వచ్చియుండిన ని • శాచరగుంతవొ? తోచదయ్యెఁగా ॥

ఛీ ! ఛీ ! నమ్మఁదగదు. కావున నో మాయకారీ!

క॥ కపటపు వేసముఁ బూనుచు
సహకారము సేయవచ్చి • నట్టి విరుద్ధం
పు పిశితాశనుఁడవగుచోఁ
గృపఁ జూడడు పవనసుతుఁడు - క్రూరుఁడవౌ మ్మా ?

మైరా—(తనలో) ఏమి! వీఁడునన్నుకనుఁగొనెనా యేమి చెప్పుమా! కాలాంతకునివలె నున్నాఁడు. వీఁడుచేసెడు శ్రీరామస్తవమంతయు వైరులభయపెట్టుమాటలైయున్నవి. నన్నుసత్యము గాఁగనుఁగొనియెనా తప్పించుకొనుమార్గములేక చావవలసినదే! (యోచించి) ఎట్లుగుర్తించియుండును? నాయనుమానమేనన్ను బాధించుచున్నది. కానిమ్ము. వీనినమ్మించనిటఁబలికెద (ప్రకాశము) హనుమంతా! నీ విపరీతప్రసంగమునకంతములేనట్లున్నది. కన్నులువిచ్చిచూడుము. నేనెవఁడనో నీకు స్పష్టముకాఁగలదు. ధీమంతా! మనప్రస్తుతకార్యమునకంతరాయము కలుగకుండునట్లప్రమత్తుఁడవై యుండుమంటినిగాని నీకుభక్తివలదంటినా? నేనును శ్రీరాముపదసేవకుఁడనే!

హను—(పూర్వప్రస్థితిలోనుండియే) ఛీ! కల్ల. మాకపిసేనలో నీయట్టివ్యర్థప్రలాపయుండునా? నీమాటలు విపరీతములై నీవునిక్కముగా కుటిల దైత్యాధముఁడవై నన్నుమోసపుచ్చ వచ్చినవాఁడవని స్పష్టముగాఁజెప్పుచున్నవి. పొమ్ము. మారుమాటాడకఁ బ్రాణములదక్కించుకొమ్ము.

మైరా—హనుమంతా! భక్తిపరవశత్వమున మైమఱచి నన్నుశంకించుచుంటివి. నేనెవ్వఁడనో చెప్పెద. వినుము.

క॥ పుట్టుకచే దనుజుఁడనై
పట్టితిశ్రీరాముపాద • పద్మంబుల నా
గుట్టెఱుఁగరె మీరందఱు
నిట్టులననుమానపడఁగ • నేలమహాత్మా?

హను—ఏమీ! దనుజకులసంభవుఁడవేనా! సరి. శ్రీరామనామోచ్చారణానర్హులగు రాక్షసవంశజాతుండవైయుండియు నిజముగా శ్రీరాముపాదసేవనాభాగ్యంబందినవాఁడవైనయెడల నీజన్మము సార్థకమైనదే. కానినీయిప్పటిమాటలు కపటంబులైనమ్మఁదగినవి కానట్టులున్నవి.

ఉ॥ దానవవంశజుండవని • తావకవాక్కులెరూఢిఁ జేసెగా
నీవరినాథమాళికను • నేస్తుఁడవౌటను నమ్మరాదుమీ
దానవవంశవర్తనలు • తద్దయునాకిటఁ గ్రొత్తగావు ని
బూనిటువచ్చియున్నవిధ • ముక్కయనుమానముఁదోపఁ జేసెనూ॥

ఉ. కాంచనమానముం బసఁడుఁ గట్టఁగఁ గిల్పనసేయఁ బోక ని
పావనిమైన శూరకులు • బాహుబలాఢ్యత నాదు శౌర్యముఁ
భావమునందు వేదలఁచ • పరుగు ప్రాణభయార్తమూర్తివై
ఆవిధ సేయకున్న భువి • యందు ననీవిఁక నుండఁబోవుసూ ॥

నిక్కము మరుగుపఱచి నీనెక్కరణినైనఁ దప్పించుకొని పోఁజూతువేమో! అని వట్టిభ్రాంతి! వెఱ్ఱియూహ!

గీ॥ మాయనాటకధారిణై • మహిననిశము
సంచరించెడు శ్రీరామ • చంద్రముండు
దనుజమూకలు నీభక్తి • దుంబులగుచు
భానునిన్నని దమముల • బాయుమగఁడి॥

అంతవఱకుఁ బోకుండఁగనే నాచేతనే మడియఁగలవు. నాసంగతి మీకందఱికి విశదమేగదా! మఱచిపోతివేమో? జ్ఞప్తికిఁ దెచ్చుకొనుము. కాదు కాదు. నేనే చెప్పెదవినుము.

సీ॥ బాల్యమునందున ఫల • భ్రాంతి భానునిఁ బట్టి,
దిగమ్రింగి పుడమిపై • నెగడినాఁడ
సుగ్రీవుమంత్రినై • శూరులలో మేటి,
బలసహదలచేత • నలఁగినాఁడ,
శ్రీరాముపనుపున • సీతను వెదకంగ,
లంఘించి వారధి నలం • ఘించినాఁడ,
జనకజక్షేమంబు • జాడలఁ గన్గొని,
కాకుత్స్థునకుఁ జెప్పఁ • గలిగినాఁడ
మొనగువచ్చిన దనుజుల • నెల్లఁ ద్రుంచి
కడకు మీలంకినంతయుఁ • గాల్చివైచి
యుద్ధసన్నద్ధుగాఁ జేసి • యుర్వీపతినిఁ
దెచ్చి దానవవీరుల • ద్రచ్చినాఁడ!

కావున నా సంగతిని గన్గొని నీపాటనుండి ప్రాణంబు దక్కించుకొనవమ్ము. లేదా నా కోపానలమున కిప్పుడే యాహుతిగాఁగలవు. జాగ్రత్త.

మైరా — ఏమోయీ! హనుమంతా!

హను — ఛీ! దుర్మదాంధా! చనువిచ్చి ముచ్చటించుచున్నందులకు నా భక్తికి భంగము గలిగింపఁ జూచినదే గాక మీఁదుమిక్కిలి పరువు హీనముగా "నోయీ" యని సంబోధించుచు నన్నుఁ దృణప్రాయునిగాఁ జూచుచున్నావా! నీకిఁక బ్రతుకుదినములు లేనట్లున్నవి. ఇన్నిదినములుగా నీవు మాకపివీరుల సహవాసము తోడ మెలంగుచున్నది నిజంబయ్యెనేని యథార్థముగా నీకు మర్యాదవర్తన మలవడవలసినదే. నీయంతరము నాయంతరము గుర్తెఱిఁగి బుద్ధిఁ దెచ్చుకొని బ్రతుకఁగనుము. మంచితనమున నేనొనరించు హితోపదేశమును మదినిడుకొని సుఖింపఁ జూచుకొమ్ము.

ఉ॥ చింత యొనర్పు మోరి నిబఁ ♦ జెప్పెడి నాహితమంచు మోరి నీ
స్వాంతము మారు మోరి బల ♦ వంతపుఁ జావునుఁ గోరకోరి యే
కాంతమునందుఁ జిక్కియుఁ బ్ర ♦ గల్భములాడఁగఁ జూడకోరి నీ
యంతర మెంచకుండఁగ వి ♦ హారము సల్పఁదలంచినాఁడవే!

నీ మేలునకింతగాఁ జెప్పుచుంటిని. ఒక్కయడుగిడియు లోపలఁ బోయితివా నీ ప్రాణములుండబోవు.

మైరా — వనచరేశ్వరా! నేనెవ్వఁడనైనదియు, నా చరిత్రమెట్టిదైనదియు తరువాత విచారించుకొనవచ్చును గాని నీ ప్రస్తుతచర్య మనకార్యమునకు విఘ్నకారియైనదనియు దానిని సవరించుకొమ్మనియు మఱియొకసారి నొక్కి చెప్పుచున్నాఁడ.

హను — (తదేకనిష్ఠాగరిష్ఠుండై యుండియు గర్వితచిత్తుఁడై) మనకార్యమేది?

మైరా — అదుగో! నేఁ జెప్పలేదా? అసలు కార్యమేమఱచి యున్మత్తునివలె సంచరించు నిన్నేమనిన యేమి ప్రయోజనము? నీవేమో వెలుఁగఁ బెట్టుదువని మేము నిన్నైనాశతో నిశ్చయముగా నుండుటమా లోపమే? ఎవరిపని వారు చూచుకొనవలెగాని పరులపై నాశవహించి వలెఁ జూచుట వెఱ్ఱితనము. సరి. సరి. బాగాయె. అనరాదుగాని కేసరిపుత్రా!

చ॥ క్రిమితతి వనాంతర స్థలినిఁ ♦ గాలముఁ బుచ్చుచఁ జెట్టుచెట్టుకున్
జనుచును బండ్లగుత్తులను ♦ దాఁగిలిచున్ గడు పారవేకుచున్
భ్రమరముచున్ సదా మధువుఁ ♦ బానము సేయుచు కైపునొందఁగా
సానసలి కీచుకీచుమను ♦ చుండెడి కోతుల రీతి పోదుగా!

నీవో వోకేల? నేఁబోయెద, నీయిష్టమువచ్చినట్లు చిత్తచాంచల్యమున గంతులువేయుచుండుము.

హను — బలే! శృతిమించిరాగమునఁబడినట్లు నీవాగాడంబరమును మఱింతయధికముఁజేయుచుంటివి. ఇంతవరకు చాలు. నీ పేరిలుడు గట్టిపెట్టి నీయుదంత మెఱింగించి నీదారినఁబొమ్ము. లేకున్న యీ శ్రీరామదాసుఁడు, దుర్మార్గుల—సాధుజన నిందాపకారుల—తుచ్ఛప్రసంగాయత్తచిత్తుల—కుటిలకార్యక్రియాపరతంత్రుల మాయామంత్రతంత్రజ్ఞుల—జాలిఁదలఁచి వదలువాఁడుకాడని యెఱుంగుము. అయ్యయ్యో! నాభక్తిమార్గమున కడ్డుపెట్టితివి. (మరలభక్తిపరవశుఁడై) హా! హా! రామా! రామా! నీమహిమ లనంతములుగదా!

మైరా — (స్వ) బలే! నాకనుకూలమగు మంచిదారిలోఁబడినాఁడు. ఇఁక నేనువిజయముఁబొందినట్లే! (ప్రకాశము) ఓయీ! వెఱ్ఱికి వేయివిధంబులనునట్లు నీకిపుడో క్రొత్తవెఱ్ఱిపట్టినచే నీదారొకటియు నాదారొకటియు నగుచున్నది. నీనడవడి బొత్తిగాబాగులేదుగదా! హనుమంతా!

ఉ. మాయలమారి రావణుఁడు • మానవనాథులఁగొంచుబోయి నీ
వేయిని కాళికిన్ వడి బ • లిం దగఁజేయుఁ బ్రతిజ్ఞబూనఁగాఁ
బాయనిభక్తి నీవిటుల • భ్రాంతినిఁజిక్కి జరించుచుండు నీ
యీ యవివేకమెంచనగు • నే? రఘురాముని కెగ్గుఁగూర్తువే!

హను — (భక్తిలోనుండియే విస్మయముతో) మైరావణుఁడు-రఘురాముఁడు—చిత్రముగానున్నది. (ప్రకాశముగా) ఓరీ! నీవెవఁడవు? మైరావణుఁడెవండు? రఘురాముఁడెవరు?

మైరా — (స్వగతమున) పిచ్చిబాగా తలకెక్కినది. తనదేవునే మఱచియున్నాఁడు. బొందలోఁ ద్రోయుటకు మంచిసమయముచిక్కినది. (ప్రకాశముగా) ఓయీ! రామునేయెఱుంగవా? మైరావణునిఁగూర్చి నేనింతకుముందు చెప్పినదప్పుడే మరచితివా? సరిపోయె. మొదటికే మోసముఁదెచ్చినని న్నేమనందును?

హను — (కొంచెము స్మృతినభినయించి) మైరావణుండనఁబ్రతాప లంకేశ్వరుండనియు, మాయలమారియనియు, నిదివఱకు వినియుంటిని. అతనినిగూర్చియే నా నీవిప్పుడు ప్రస్తావించునది. సరే! రానిమ్ము, వచ్చినా జచ్చునాఁడేగదా!

మైరా — పోనిమ్ము. అంతవఱకైనస్మృతియున్నదంతియేచాలును. అతఁడువచ్చి నీకనులఁబడినగదా చచ్చుట. నీపిచ్చిభక్తిరసప్రవాహములో నీవు మునింగియున్న

వణుని చేతఁజిక్కియుండినను రామలక్ష్మణుల బలిమిగల నీతోకక్రింద నలిపివేయుట నూహించితివా!

హను— నిజమే. ఐన నీవేమందువు?

మైరా— నేను లోనికరిగి రామలక్ష్మణుల క్షేమమారసివచ్చి నీకెఱిఁగించి వానిని కిఁబోయెద.

హను— అలాగే కానిమ్ము!

మైరా—(లోనికరిగి రామలక్ష్మణుల పైమచ్చుమందుఁజల్లి మందసములో నుంచుకొనివచ్చి) హనుమంతా! రామలక్ష్మణులు సుఖులై గాఢనిద్రాపరవశులైయున్నారు. ముందైన మూఢభక్తిలో మునుంగక స్వామికార్యమునందప్రమత్తుఁడవైయుండుము, (తనలో) నేను వీనిని దాటిపోవునంతవఱకు వీనికిమఱలఁ బిచ్చియెత్తింపకున్న నన నానప్రజ్ఞాదురంధరుండగు వీఁడు నన్నుఁ గనుంగొనునేమో? కనుంగొనెనా చావు నిశ్చయము (ప్రకాశముగా హనుమంతునితో) హనుమంతా! రావణునిదాడికి నోడి నిన్నుఁగించితాఁకాలము భక్తిమాటఁదలపెట్టక కార్యానుకూలతలో నుండుమంటిని గాని బొత్తిగా మానుమంటినా; నాయంతు నెఱుంగక నిష్కారణముగ నన్నుఁదూలనాడితివి. నాకుమాత్రము శ్రీరామభక్తి ముక్తిదాయకముగాదా!

క॥ సర్వాత్మకు సర్వాధికు
సర్వజగత్కర్తు సర్వ• శక్తిసమేతుం
సర్వజనారాధితపదు
సర్వేశ్వరుఁగొలువకుండఁ • జడుఁడిలఁ గలఁడే॥

హను— విభీషణా! నీభక్తివిశ్వాసముల నెఱుంగనా? నేననిక్కముగాఁ బొరఁబడితిని. దైవానుకూలంబున నవర్థకము సంభవించియుండలేదు.

మైరా—(తనలో) మందమతీ! ఇప్పటికిఁ దప్పినదా! ముందున్నది ముసల్లపండుగ యను నట్లుకొంచెము నిదానించుము. నెత్తిమీఁద నోరఁజెట్టుకొని కుయ్యోమొఱ్ఱోయని యేడ్వఁగలవు.

హను— విభీషణా! నీవను నావ మాయఁ దనుండకున్న దానవమాయాజనితవార్థిని నుత్తరింపసాధ్యమగునా!

మైరా— ఎట్లో పనిజరుగుచుండెను. ఇదిపొగడ్తలకు వేళగాదు. ఆవలదానవులాడలే మైనఁదెలియ వచ్చినదేమో చారులవలన నెఱింగిత్వరలో తిరిగివచ్చెద.

మ॥ అసమానంబగు మాయరావణుని కా • ర్యంబంత ; పాపుండు బల్
వ్యసనుండద్భుత మంత్రతంత్రరచనా • దక్షుండు వేరీతి నే
దెసరానోపునొ ? యేమిచేయునొకొ ? నీ • తేజ ప్రతాపాగ్నిగా
క సమర్థింపఁగ నెట్టివారికి నిశా • క్యంబౌనె లోకంబునన్ ॥

హను— విభీషణా ! ఇప్పుడిప్పుడే యిందు వచ్చి నన్ను హెచ్చరించి చిత్రచిత్రములుగా మాటలాడిపోయినవాఁడవు మరల యరనిమిసములో వచ్చెదు నీయంతుఁగంతగనున్నది. సరియే ! వచ్చితివి గాని

గీ॥ మాయరావణుఁ జాడలే • మాత్రమైనఁ
దెలియవచ్చెనె ? యేదెసఁ • దిరుగుచుండె ?
నేమి సేయఁగనున్నాఁడొ • యెఱుఁగఁ జెపుమ
పట్టిబంధింపఁ జూతునా • పాపినిపుడె !

విభీ— (సంభ్రమవిషాదములతో) ఏమి గ్రహచారము ? నేనేమి ? ఇప్పుఁడిందు వచ్చిపోవుటేమి ? ఆశ్చర్యముగానున్నది! పాపి మైరావణుఁడు నా వేషమూని వచ్చి మాయపుచ్చియుండునా ? (ఆలోచించి) సందేహమేమి ? లేకున్న హనుమంతుఁడు నాయందసత్యమాడునా ? ఏదియో కొంపమునిగినది. (ప్రకాశము) ధీమంతా ! నాయంతుఁగనుఁగొన మాట్లాడ చుంటివా ? లేక పరిహాసమునకనుచుంటివా ? నేనేమి ? రావడమేమి ? పోవడమేమి ? అంతయు సందేహాస్పదముగానున్నది. కార్యము మించిపోలేదుగదా! సంగతి సవిస్తరముగా నెఱిఁగింపుము.

హను— (అనుమానముతోఁ దనలో) అయ్యో! నిజముగాఁ గొంపమునిగినట్లేయున్నది. సంగతులొకదానికొకటి భేదించుచు విపరీతములుగానున్నవి. ఏదియో కపటము జరిగినది అది యీ విభీషణునికపటమో ? మైరావణుని మంత్రమో ? కానిమ్ము వీనియంతు ముందుకనుఁగొనవలయు. (ప్రకాశముగా) ఏమేమీ ! నీవిప్పుడిందు రాలేదా ? ఏమి నీ ధైర్యసాహసములు. హనుమంతునితోనే యనృతములాడ సాహసించిన నీకితరులు లెక్కయగుదురా ! నీకిదివరకిట్టి తుచ్ఛపుబుద్ధులు పుట్టవయ్యె. ఇంతలో నింతమార్పునకు హేతువుండకమానదు. కాని విభీషణా !

చ॥ దనుజుఁడవయ్యు మీకుటిల • దైత్యుల మర్మముఁ గాంచకుంటనీ
ఘనతకు లోపమానను చి • కాకును బెందుచు దాఁచిదోపకన్

పనిబడి సూత్నమార్గమును • బట్టి జరింపుచుఁ దొల్లి నీవు చే
సినపనియంతలో మఱపుఁ • జెందితివేమొ ? నిజంబు చెప్పుమా ॥

నీవు వచ్చిపోయిన నీరాకకే సందేహాస్పదముగనున్నచో నీకుఁ జిత్తచాంచల్యమైన దని వేఱుగఁ జెప్పనవసరము లేదు. కావున మనసు కుదుటపరుచుకొని నిజమెఱింగింపుము అన్నా !

చ॥ దనుజుని మాయ జిక్కుదను • ధైర్యము వీడకుమన్న యెందు నె
క్కనికె జయంబు చేకురుట • గిల్లను నేరకగాని ధాత్రి ; నీ
ఘనతకు లోపమౌనని చిం • తకును బొందకుమన్న నిక్కముం
మనము సదా చకన్న యను • మానముఁ బొందకుమన్న నాకడన్ ॥

విభీ— హనుమంతా ! నామతిభ్రమణంబు గాదు. నీపోఁబాటో ? నా ప్రారబ్ధమో కావలయును.

హను— ఓయీ ! నీకపటంబును గప్పిపుచ్చు నెపంబున నాకే మతిభ్రమణమారోపించుచు నమాయకునిచందంబునఁ బ్రవర్తింపుచుంటివా ? శ్రీరామరక్షణ కార్యాశక్తుఁడవగుట సందర్భానుసారంబుగ నెన్నిపర్యాయములైన రావచ్చును. వచ్చియు రాలేదనుచు బొంకనేల ? ఇంతలో నీవు క్త్రైమి మూలింగినది?

విభీ— అయ్యా ! వచ్చినగదా నిజమెఱింగించుట ? రాకున్న నేమని చెప్పవలయు ?

హను— ఏమిరా ! కపటశీలా ! సాధుశీలుఁడవని నమ్మి మోసపోతిమి. రామదాసుఁడ ననివచ్చి రాముని శరణువేఁడి వినయభయభక్తులతో మాకడఁ బ్రవర్తించు నీ ప్రవర్తనలన్నియుఁ గపటములని మాకిప్పుడు తెలియవచ్చె.

విభీ— ధీరచిత్తా! ఏపాపమెఱుఁగని నన్ను నిష్ఠురోక్తులాడుచు నాపైఁగినుకఁ బూననేల ? ప్రథమ యామమున నేమి వచ్చివెళ్ళితినో యదిగాక మఱల నాకు రానిందు నవకాశము లేకపోయినది.

హను— ఛీ ! దురాత్మా ! అట్టె హాగకుము. బొంకులాడి తప్పించుకొనఁ జూచిన తప్పునే' తెలిసె. తెలిసె. నీ నక్కటక్కులు—నీ కపటవర్తనలు— మాయామంత్రతంత్రములు పరులకగోచరమని నీలో నీవు గర్వపడుచుంటివి గాఁబోలు ! ఇంతవఱకు నీవు సజ్జనుఁడవను భ్రాంతిని నీయందు విశ్వాసముంచితిని గాని నీకణుమాత్రమైన బూర్వపు మర్యాదలు జరుగఁబోవని యెఱుంగుము. నిజము నొప్పుకున్న బ్రతుకఁగల వేమోగాని లేకున్న జీవములతో నడుగైన దాటఁజాలవు.

విభీ—ఆర్యవర్యా ! నాప్రాణంబులు నాకంతతీపిలోనివిగావు. రామలక్ష్మణులు భద్రులైయున్నఁజాలును.

హను—ఛీ! విభీషణా ! ఎన్నిమాయలు నేర్చితివిరా! నీచావు సమీపించఁబట్టియే నీకీ దుర్బుద్ధిపుట్టినది. లేకున్న మానవనాథునిచే మఱువరాని యుపకారముఁబొంది మరలవారికే ద్రోహముఁగూర్పఁదలఁబెట్టుదువా! ఇంకనీతోఁబెక్కుమాటలేల ? (కపులనుద్దేశించి) ఓహో ! సుగ్రీవాంగదజాంబవంతులారా !

గీ॥ కొంపమునిఁగెను యత్నముల్ • కూలిపోయె
మోసమాయె విభీషణు • ద్రోసబుద్ధి
రెండుఱెండయ్యె కపులార • రామచంద్రు
సాంద్రకరుణకు మనకును • దూరమాయె ॥

(కపులుకోలాహలముతోఁ బ్రవేశింపుచున్నారు)

సుగ్రీ—హనుమంతా ! ఏమిసంగతి ?

అంగ—ధీమంతా ! ఏమైనమోసము వాటిల్లెనా ?

జాంబ—మారుతాత్మజా ! మైరావణుని కారణమున రామలక్ష్మణుల భద్రమునకేమైన భంగము వాటిల్లెనా ?

హను—(నిరుత్తరుఁడై విచారముతో) హా! రామచంద్రా ! రామచంద్రా ! రఘుకులదేవేంద్రా! కీర్తిసాంద్రా! హా లక్ష్మణకుమారా ! హా ! సుమిత్రానందనా !

సుగ్రీ—హనుమంతా ! ఎన్నఁడులేనిభంగి ఖిన్నుఁడవై యుదంతము నెఱిఁగింపక నూరక వాపోయెదవేమి ? విభీషణా ! నీవుఁగూడవన్నెతగ్గినమోముతోనున్నకారణమేమి ? మనలమైరావణుఁడు మోసమునముంపలేదుగదా ? ఏమయ్యా ! నీవును మాట్లాడవు! విభీషణా! విభీషణా !

విభీ—అయ్యలారా! చెప్పుటకేమున్నది ? అపవాదనాపైఁబడినది. నేను ద్రోహినైతినఁట. నావేసంబున మైరావణుండేదియో మోసము నర్పవచ్చియుండును. మనహనుమంతుఁడు నేనని భ్రమసి వానికేయేమర్మంబుల నెఱిఁగించెనో, వాఁడేమి మాయఁజేసిపోయెనో తెలియరాదు కానియీపూజ్యుండు నాపైఁగినిసినిష్ఠురోక్తులాడ మొదలిడి కఠినతఁజూపుచుండె.

హను—(కోపముతో) ఏమిరా!దురాత్మా!కఠినకర్మా!పలుగాకీ! నిన్నుఁబోలినవాఁడు వచ్చెనుగా!నీవురాలేదేమి!క్రూరా! నేనెఱుంగ ననుకొంటివా?మందమతినని తలం

చితివా! కంఠమ్ము లేనికబోదినియోగించితివా! తప్పఁద్రాగియుంటివని తారుమారాడుచుంటివా! సుగ్రీవా! ఇతనిఁబోలినవాఁడుకాఁడు. ఇతఁడే! ముమ్మాటికి ఇతఁడేవచ్చిలోనికిఁబోయి రామలక్ష్మణుల క్షేమమరసి నాకుఁజెప్పెపోయె. ఇప్పుడు కాదనుచున్నాఁడు. తప్పక మోసము వాటిల్లినది. ఇతఁడు నమ్మఁదగినవాఁడు కాఁడు.

విభీ.—అయ్యలారా! సంగతులు చిత్రములుగానున్నవి. నిజముగా నైరావణుఁడే నావేషమూనివచ్చి రామలక్ష్మణులఁ గొనిపోయియుండును. అక్కటా! మందభాగ్యులమైతిమిగదా! ఆలసింపకముందు శ్రీరామలక్ష్మణుల క్షేమమరసిరండు.

సుగ్రీ—(విచారముతో) అక్కటా! మనజాగ్రత్తలన్నియు మంటఁగలిసినవా! విభీషణా! నీవేపోయి రామలక్ష్మణుల క్షేమమరసిరమ్ము.

హను—వలదు. వలదు ఈదురాత్ముఁడు నమ్మఁదగినవాఁడు కాఁడు. వీనిఁగనిపెట్టియుండవలసినవాఁడ. సుగ్రీవా! నీవేగి రామలక్ష్మణుల సుఖమరసిరమ్ము.

సుగ్రీ—అలాగే! (లోనికిఁబోయి రామలక్ష్మణులఁ గానక విచారముతో) హా మందభాగ్యులమైతిమిగదా! అయ్యో! రామచంద్రా! రామచంద్రా! హా! తాటకీమర్దనా! అహల్యాశాపవిమోచనా! హా! వాలీమర్దనా! హా! రఘుకులప్రదీపా!

చ॥ దశముఖుఁడాదిరాక్షసులు • దర్పమునన్ సురలన్ జయింపుచున్
భృశమును బాధలన్నిడఁగ • వెక్కసులై శరణంబువేడఁద
ద్విశసనముఁ బ్రచింపఁ బృథి • క్ష్మాస్థలిఁ బుట్టిన దేవదేవ! యో
దశరథపుత్ర! యోసుగుణ • ధామ! మమున్ విడనాడనోపితే!

అక్కటా! సీతావియోగమును భరించుకొల్లి! అన్నచే రాజ్యసర్వస్వమును హరింపఁబడియిలు వెడలఁగొట్టఁబడి నేయుండలేక తల్లడచుండ నాపూర్వపుణ్యపరిపాకంబున నీయండ లభింప దండిమగఁడనై యుండఁ గలిగితినని సంతసించుచుండునంతలో నాయాశలనిరాశలఁ జేసిహరాత్ముఁగానట్టనడిసంద్రంబున గుట్టునెరింగి పట్టునువదలిపెట్టిచనితివా! మహాబలులగు యింద్రజిత్తుకుంభకర్ణాది రాక్షసులనొక్కకోలచేఁగూలనేసిననీశక్తి నేఁడీముక్కడి నైరావణుని చెంతనిష్ఫలమయ్యెనా! హా! జానకీమనోహరా! మమ్మందర నెన్నెన్నో విఘ్నంబుల నెల్లపుడుఁ గంటికిరెప్పవలెఁ గాచిరక్షించు నిన్ను మేమందరమొక్కరేయిఁ గాపాడఁ జాలమైతిమిగదా! మేమేమో నీదాస్యమును సలుపుచున్నామను ధైర్యమున గాఢనిద్రావశులైతిరిగాని తగురీతినున్న వీరరక్షణమును మీరేచేసుకొన్న మనారక్కసినినుక్కణగింపకుందురా! అకటా

మాశక్తిసంపదలమే మెంచలేక మందమతులమై ముందు వెనుకలరయక "నీస్వల్పకార్యమునువారికేలనివేదించవలె, యేలవారికినిద్రాభంగమొర్పవలె" ననిగర్వితులమైమై రావణునిగాఁచిమీకెఱుకపఱుపక నిష్కారణముగమోసపోయితిమి. అక్కటా! మీ యీపాటునుఁగని దిశపడనుండుకుమీఱి చెలరేగుటకేమిసందియము? అయ్యో! మా బ్రతుకులెట్లయినగాని సీతామహాతల్లినిరక్షించువారెవ్వరు? ఇంకేటిదారి? ఏదిదిక్కు? హా! రామచంద్రా! హా! రామచంద్రా!

హను.—(స్మృతిఁగనిదుఃఖముతో) హా! రామా! రఘుకులసోమా! సుగుణసుగాత్రమా! పరంధామా! కర్తికామా! నేటితో మాకు నీసపర్యలఁజేయుభాగ్యముతీరిపోయెనా! తెల్లవారునుదశకంఠుతేజముఁ ద్రెళ్లఁజేసి సీతామహాసాధ్వి చెరఁద్రోసి పుచ్చి మీయుండఁజేర్చుకొని సుఖసంపదలనోలలాడుచుఁదరి లోకంబులమీకీర్తిని స్థిరముగానిల్పగు గనికొంటంటియాశతో నుంటిమి గాని మాయాశ లెండమావులలోని సలిలంబురీతి ఫలితశూన్యము నొనసి నిలంపకపోయెమిగదా! నిరతిశయోమేముపడినశ్రమలురవంతలోనిష్ఫలంబులయ్యె. ఇంక మమెవరకొఱకుఁ బాటుపడువారము. ఆ మైరావణుండెంతమాయలమారివాఁడగియో ప్రాణపర్వ్రశ్చే మీయాశ్రద్ధ పరిభావముచేత దండివాఁడనిభూమండలియందఖండప్రఖ్యాతినందిన నాబిండితనమును మొండెముఁజేసిపైచినాఁడు. నేనింక నేమని భూమండలినుండగలను? మేటిమగఁడనని మీరునాకిడినబిరుదుతో నొక్కరెయినిద్రాశక్తులైనమిమ్ము— మాదాస్యంబునకుపొంగిమీకెట్టియాపదలురావనుగట్టినమ్మకముతో నెడపయిఁజేయునిడుకొని సుఖనిద్రించెందుమిమ్ము—రాక్షసవధాసమాప్తియయ్యె, మిగిలినదశకంఠునొక్కని శేషకడఁద్రుంచిసకలయక్షకిన్నర కింపురుషసురమానినరవానరలోకంబునకు హాయిగూర్తునను యాసంపంబుతో సుఖనిద్రించెందుమిమ్ము-వేదవేదాంగపారంగతులరగుమిమ్ము—లోకప్రియులరగుమిమ్ము-జగదానందస్వరూపులగుమిమ్ము-రక్షింపనశక్తులమైతిమనునపయశంబుతో నేమనితలనెత్తుకఁదిరుగనేర్తు? రామచంద్రా! రామచంద్రా! ఇనుముతోఁగూడినయగ్నికి సమ్మెటవ్రేటులమరునట్లు దౌర్భాగ్యులమగుమమ్ముఁగూడినకతనమీకీపాటుకల్గినది గాని లేకున్న రాఁదగినదియా! ఆపాపిమైరావణుండు మిమ్ముమి చేయనూహించెనో? అన్నట్లుకాళికిబలిపెట్టునా! మాయదృష్టములుబాగుండి మీకావేళకు మెలకువవచ్చినమేము ధన్యులమగునట్లు మైరావణునివంశనిర్మూలమునుఁజేయుకుందురా! దురదృష్టవంతులమగు మమ్ము నమ్మిచరించిన మీకు మెలకువవచ్చునో? రాదో? ఒకవేళమెలకువరాకున్నను సకలభూతదయాపరుండ

పగచినన్నొక్క నిశాచరుఁడు పట్టిఁబెట్టుచుండ మీకు మొఱఁబెట్టఁగలిగింపకఁ బావనమై నమీ పలలములు భక్షించుటకు జగజ్జననియగు కాళికేశ్వరిమాతృమిచ్చగించునా! అయ్యయ్యో! ఎట్టియూహ? పిరాధపీసుల నేమోసపుచ్చఁజాలినవాఁడెట్టి మచ్చు మందులు ప్రయోగింపక వారలఁ గొనిపోయియుండునా! ఆమందుల ప్రభావము రత్నాకరునా! అక్కటా! మాయార్తజాతులవిని మాకు ధైర్యముఁ జెప్పి కన్నబిడ్డలకన్న నెక్కుడు ప్రేమతో మమ్మరసి రక్షించువారింకెవ్వరు? కరుణాసింధూ! ఇది రాక్షసుల మాయగాదు. నిజముగాదు. నీవిందువచ్చియుండినపని పూర్తియగుటఁ బాపభూయిష్ఠమగు నీప్రపంచమందుండుట కిష్టపడక నీకైనీవే మనువీడియుందువు. లేకున్న మీకట్టిపాటైన రానేర్చునా! ఇట్లు మమ్ము హఠాత్తుగా విడచిపోవుట మీకుధర్మమా! నీశిష్టులమగు మమ్ము వెంటఁగొనిపోవ భారమాయెనా! మాకింకేదిదిక్కు? హా! రామా! రామా!

విభీ—(స్వగతము దుఃఖముతో) అయ్యో! నేనెట్టిపాపుఁడను?

చ॥ అనుజుఁడు కొల్వుకూటమున • నాగ్రజుఁడైననుఁ బాదతాడనం
బున నుకరాభవించి వడిఁ • బొమ్మన వేఁగుదిక్కులేక నే
యనఘుని నిన్ వేఁడితిని • మందిరిఁ? నా మహనీయుమాయరా
వణునకు నుప్పఁజెప్పితిని • పాతకమింతకు మేలయున్నదే!

హా! ఇక్ష్వాకుకులచంద్రా! నిన్నెట్లు మఱువఁగలను. సకలరాక్షసాంతకుండవై భూమినవతరించిన నీకే దనుజులచేత ముప్పు దప్పలేదన నిఁకలోకంబున నెవ్వరు సుఖులై యుండఁగలరు? రామా! నామాటలు నమ్మఁ జిగినవో కావో చూతమని మైరావణునిచర్యలంగని పెట్టి నిండెంబైన దాగియుంటివా? అదియే నిశ్చయము లేకున్న నేవేడ? రాక్షసుల బారికిఁజిక్కెదవ? హా! సీతారమణా! పూర్ణపరీక్షఁ జేయుటకిది సమయము గాదు. నీవు కనుపించనికారణమున నీవనచరులందఱు నాపైగినిసి నేఁగపటవర్తనుఁడనై మీకెగ్గుఁగూర్చితిననుచు నన్ను బాధింపనున్నారు. వీరిబాధలకంతగా జంకనుగాని హనుమంతుఁడూహించినట్లు "దశకంఠునకు మీవలన గలుగఁబోవు యాపత్తునుఁ దొలఁగించి రక్షింపఁగపటభావమూని మిమ్ము శరణని మిమ్ము నమ్మించి యీవిధమట్టుఁబెట్టి సోదరప్రాణరక్షణఁజేసె విభీషణుం"డని జనులాడకొను నిందావాక్యములకెట్లు తాళుకొందు? అటు రావణుఁడు తనగుట్టుమట్టులమీకుఁజెప్పుచుంటినని నాపైఁగినిసియు మీయందనుండుటన న్నేమియుఁజేయ

ఆసుమంబులమధ్య • నందమై భాసిల్లు
తామరపుష్పంబు • దనరుచుండు
దానినాళంబులో కొద్ది • దారియుండు
నట్టి దారినిగను పెట్టి • గుట్టుదెలసి
సూక్ష్మరూపంబుచే నంగ • జొచ్చికొంత
జంకకనుబోన పాతాళ • లంకయుండు॥

ఆదారియందు లెక్కలేని రక్కసులు చక్కని కావలిని గాయుచుందురు చలించినట్లైన నందు జొర నవకాశముండదు. అతిజాగ్రత్తతో బోవలయును.

హను — కావచ్చును. కపివీరులారా! ఈ విభీషణుని మాటలయందు నాకు వెనుకటి విశ్వాసము లేదు. ఇదెంతవఱకు నిజమో కనుంగొనుట కర్తవ్యము. నేవచ్చువఱకు మీరు వీనిని గట్టి భద్రముగా బంధనంబునందుంచి కాపాడుచుండుడు. మాయలమారి వాడగుట వేషముచ్చి పారిపోవునేమో? మంచిపూదమోస మొనర్చువారిలో వీడగ్రగణ్యుడు

అంగద — ఆలాగే.

హను — జయ రామచంద్రా! రఘువేంద్రా!

(అందరు నిష్క్రమించుచున్నారు)





శ్రీ

# హనుమద్విజయము.

—— :0: ——

## షష్ఠాంకము.

లంకాపురిలోని బాహ్యోద్యానవనము.

ప్రవేశము :— హనుమంతుఁడు.

హను— (ఒంటరిగాఁ బ్రవేశించి) ఆహా! ఏమియీవనసౌందర్యము ?

చ॥ అనుపమనూత్నవస్తుసము ♦ దంచితవృక్షసమన్వితంబునై
కనులకుఁ బండువై సకల ♦ కామితపుష్పవిరాజమానమై
ఘనమగువింతయైసురల ♦ గర్వముఁ ద్రుంపఁగఁ జాలురీతిని
వనము ప్రశస్తమై చెలఁగెను ♦ పట్టుచునుండెను సౌఖ్యదాయియై !

ఎన్నియో వనరాజులఁ గాంచితిని గాని నిజముగా దీనిఁబోలినదాని నెచ్చటఁ గనియుండలేదు.

ఉ॥ సారరసాలసాల నవ ♦ చందనచంపకకుంద బిల్వజం
బీరతమాలసుందరక ♦ పిత్థలవంగకదంబపుంద్రుమం
దారమధూకద్రాక్షసుర ♦ దాడిమచూతకనారికేళ ఖ
ర్జూరశిరీషవృక్షతతిఁ ♦ జూడనగ ద్తగఁజుట్టునొప్పెగా !

దానిమధ్యనందందు విరాజిల్లు విచిత్రములోకదానిమించి మరియొకటి ప్రకాసింపుచున్నవి. అన్నిటికన్న నీతటాకరామణీయకము బహుచిత్రముగానున్నది.

చ॥ స్ఫటికపురాలపైదశది ♦ శల్నవమౌక్తికవజ్రసిల సం
స్ఫుటమొనరించి శిల్పకుని ♦ బూజ్యత వెల్లడిఁ జేయ నీటిపై
దిటవగుమెట్లచాలు ఘన ♦ దీప్తులు నిండఁగ దట్టమైన చీ
కిటులు నశింపఁగోట్లరవి ♦ కాంతులు దోఁచిన రీతి నొప్పెడిన్ ॥

# హనుమద్విజయము.

దీనిమధ్య విభీషణుఁడు వచించినట్టి దశవశీకమలముతన కాంతులు దశదిశలకు బ్రసరించఁగమ్మని తావుల వెదజల్లుచు మిగులయొప్పిదమైయున్నది. అదియేగదా పాతాళలంకకుఁబోవుమార్గము. అచటికేగి సూక్ష్మరూపంబునందుఁజొచ్చి లంకకరిగి మైరావణునిబింకమడంచి రామలక్ష్మణులఁగైకొనివచ్చెద. (అనిసూక్ష్మరూపంబునఁ గమలముగుండదూరిలంకలోఁబ్రవేశించి) ఆహా! ఈపురసౌందర్య మెంతో వర్ణింపఁదగియున్నది.

క॥ ధనదునియలకాపట్టా
మునినాథు కైలాసమునియు • హర్మ్యముతోడన్
ఘనమును మేఁబొక్కఁబొందురు
కనుఁగొనన్ నీపురమునసాటి • కాఁగలవొక్కొ?

ఈపురము విశ్వకర్మనిర్మితంబోయన అనన్యసామాన్యశిల్పకళాకల్పిత సీమంబగుచు నమరపతినగరంబునకతిశయించుసౌందర్యంబుతోడను, నలకాపురంబునకధికంబగు సంపదలతోడను, సమస్తవస్తుసంభారపూరితంబులగు మందిరంబులతోడను, నవరత్నస్థాపితంబగు బంగరుమిద్దెలతోడను, సర్వశోభితంబులగునుపవనంబులతోడను, కమలకుముదకల్హారవిస్ఫురితమకరంద మధుధారాపూరితనిర్మలనీరతరంగంబులతోనొప్పు సరోవరంబులతోడను, వాపీకూపతటాకసరవిహారణ కలహంసచక్రవాకాది జలవిహంగకోలాహలముఖరిత దశదిశావకాశంబులగు పరిసరోద్యానభూములతోడను, సర్వాంగశోభితసందోహ నిరంతరచంద్రశాలావితత సౌధపరంపరలుగలిగి అనంతశతకోటిరాక్షససేనాసమన్వితంబై చూపరులకుభీతిఁగొలుపుచుఁజలిచీమకైనఁజొరనశక్యమగునట్లు గట్టికాపుదలతోనొప్పుచున్నది. అకటా! ఇట్టిపురంబులోరామలక్ష్మణులఁగొనివచ్చి పాపిమైరావణుండెచటదాచెనో! ఒక్కవీధివెదయుటకే యొక్కయామముచాలదన నీపురమంతయుఁగలయవెదకి రామలక్ష్మణులయునికినిఁదెలియఁగలుగుటకునాకీరేయి సాధ్యమగునా! అయ్యో! నాకిచ్చటియుదంతంబెఱింగించు పుణ్యాత్ములెవ్వరున్నారు? లంకఁబుట్టినవాండ్లందరు రాక్షసులుగాక దేవతలుందురా! ఏలయుండకూడదు. అందుకువిభీషణుఁడుతార్కాణముగాదా! కానిమ్ము. సాధ్యమైనంతవఱకుఁబ్రయత్నించిచూచెద(అనుకొనుచునొకదారినిఁబట్టిపోవుచుండ)

## ప్రవేశము:—మత్స్యవల్లభుఁడు.

మత్స్య—(స్వగతము) దేవదానవయక్ష సాధ్యకిన్నరకింపురుషాదులకుఁగూడ నభేద్యమగునట్లు దశదళకమలనాళంబున బహుసూక్ష్మముగ గుప్తపఱచియుంచిన మార్గంబును గను పెట్టి నిర్భయంబుగాఁ బురంబు ప్రవేశించి యొంటరియయ్యు నిందుసంచరింపుచున్నయీవీరుఁడెవ్వఁడో సామాన్యుఁడని చెప్పవలనుపడదు. ఈతనిఁగనినంతనే నామనంబునకొకవిధమగు భక్తివిశ్వాసములంకురింపఁ గ్రోధాగ్ని సమసిపోయి వానిపాదంబులపైఁబడి ప్రణుతియొనర్పబద్ధియగుచున్నది. కారణమరయఁదోచకున్నది. కానిమ్ము. వీనియుదంతమేమియో మొదటవిచారించెద. ఛీ! విచారింపనేల? నా స్వామిగారాజ్ఞకు వ్యతిరేకముగా మెలంగుట నాకు ధర్మమగునా! వీఁడెవ్వఁడైననేమి? నన్నెమఱచి పురప్రవేశమొనరింపఁజూచువీఁడు శిక్షార్హుఁడుగాకుండునా! (ప్రకాశముగా) ఓరీ!

కం॥ ఎవ్వరివాఁడవు చెప్పుమి
ఇవ్విధజను బెంచినావొ • యేర్పడ నిటకే
యివ్విధరాఁగతమేమొకొ?
చివ్వన సర్వంబు నాకుఁ • జెప్పుము ధీరా!

ఈయర్ధరాత్రంబున నొంటరిగా నీవిట కేగుదెంచినవిధమరయఁ జోరవృత్తిని మా ధనకనకవస్తువాహనంబుల నపహరించుకొనిపోవవచ్చినట్లున్నది. ఇది మైరావణుండేలు పాతాళలంకయనియుఁ దదీయసేవకుండగు మత్స్యవల్లభుండు వాకిటఁగావలియున్నాఁడనియు నీవెఱుంగకవచ్చితివేమో? నీవెంత పొరబడితివి! స్వశక్తిఁ బరశక్తి నెంచకఁ దొందరపడి నిట్టిపెనుకార్యంబునకుఁదలపడిన నీయవివేకమునకు నిందసేయను. నీయత్నమును మాని మరలిపొమ్ము. పరబుద్ధిని తెంపరివై నీవీపనికిఁ బూనినచోఁ గష్టములపాలు గావలసివచ్చును. ఎట్లయినఁ బ్రాణములఁ దక్కించుకొనుట నీకు ధర్మము గదా!

హను—(తనలో) ఈతనివాగ్జాలమును—యాకృతిని. వినయవిధేయయుక్తంబగు నడవడినిఁజూచిన కేవలరాక్షసవంశసంజాతుండుగాక సద్వంశజనితుఁడైనట్లు సూచింపుచున్నది. కారణాంతమున నీదనుజహతకునికొలువునందినుండనోపు. కాని స్వామిభక్తితత్పరుండగుట నాకనుకూలుఁడగునట్లు తోఁచదు. ముందు వీని ప్రవర్తనమెట్టి

లేఁ యాలపైకి దుముకఁజేసి దానినంత మొందుభంగియగుఁగాదె. మాయమాటలనన్నుఁ బ్రసన్నునిఁ జేసుకొనఁ జూచుట నాకోపానలంబును నినుమడించుటయే యగు. ఇంతటికైనను నీచేసిన యవివేకమును సవరించుకొని సోసిలోగ్గివానిఁ గాంచుము. లేకున్న నీకిప్పుడే తుదిముట్టఁగలదు.

భాను—మత్స్యవల్లభా!

ఉ॥ నీవినయప్రవర్తనలు • నీకపిలాసవిచిత్రవైఖరుల్
నీవచనప్రసక్తియును • నీముఖతేజముఁ గాంచి భక్తిసం
భావితమంచు నెంచి నినుఁ • బాలనసేయుచునుంటిగాక నీ
నీవిధదుష్ప్రవర్తనల • నేఁ జెఱియింతు నటంచెఱుంగిగా!

నీవుఁ బసిబుద్ధి గల్పఁగలను గాని నినువీక్షించినప్పటినుండియు నీపై నాకొకపుత్రప్రేమ యుదయించుటఁ జేసి నీమాటలనంతగా సరకుసేయకుంటి. నాదాక్షిణ్యభావనను దలంచక వదరఁ జొచ్చితివి. పసివాఁడవు. మంచిచెడ్డ లెఱుంగవు. ఇంకనైన మంకుతనమును విడచి మార్గమునకు వచ్చి క్షేమమునుఁ గల్పించుకొనుము.

మత్స్య—ఓహో! పౌరుషవంతుఁడనని చెప్పుకొనుచుఁ బురుషునివలె మాటలాడక సుంత లోకసామాన్యమార్గమువలెఁ గించెపవేమి? ఇంతమాత్రము మదినిలకడలేని మందమతివి యేదో ఘనకార్యమాచరింపవచ్చితి ననిబల్కుచుంటివి. అదెట్లు సేయఁగలవు? పాతాళలంకకు సునాశీరుణాలఁ బుట్టినిల్లని దలంచితి వేమో? కాదు. కాదు. ఖ్యాతిగల వీరపురుషుల కాపురస్థలమని యెఱుంగుము. శతకోటి వీరాధివీరులగు రాక్షసయోధుల నివాసభూమియని గమనింపుము. ఏమీ! ఇప్పటికైనఁ దెలిసినదా? ఇఁక మాఱుమాటాడక పెడ్డదారి గాఁ గాలికిఁ బుద్ధి సెప్పి ప్రాణములఁ దక్కించుకొమ్ము.

భాను—డింభకుండవని జాలిఁ దలఁచి సంరంభమును జూపకున్నందులకు వేఱువిధమునఁ దలపోయుచు జ్ఞానహీనుండవై మాటలనుఁ గోటలు దాటించుచున్నావు. నిన్నుఁ గరుణింపఁదగినవాఁడవు కావు. కాని నామదియేలనో వెనుకాడుచున్నది.

మత్స్య—ఏలనా? అసహాయదుర్దశత్వమున— లేనిబింకమును బూనినకతన— మీనములఁ బెంచిన నాఁడు దానవగుటచేత.

భాను—ఛీ! వాచాటా! నోరుమూయుము

ఉ॥ బాలుఁడవౌట నీకిపుడ • పాయముఁ జేయఁగ లేక నీపయిన్
జాలిఁ దలంపుచున్ దగిన • శాంతముఁ దాలిచియుండ నీవహో

గోలతనంబుఁ బూనివినఁ • గూడనిపల్కులనాడఁ జొచ్చితే!
బాలిశ! యూరకే భువినిఁ • బాయఁగఁ జూచుట నీకు మంచిదే!

మత్స్య—ఏమీ! నేను బాలుండనా. నీవు ధీరుండవా! నీ పరశౌర్యతృణీకృతభావము నిన్నెంత భ్రమపెట్టుచున్నది.

కం॥ బాలుండనో? నీపాలికి
కాలుండనో? ముందుఁ జూడఁ • గలవు గనీవే!
లాలింపుమాట పోటికిఁ
జాలింపుము నీదు మాయ • సంభాషణముల్

సమయము వచ్చినప్పుడు వెన్కంజవేయుట వీరపురుష లక్షణము గాదు. నిజముగు ధీరుండవైనఁ నన్ను గెలిచి యావల నడుగిడుము. నన్ను లాలించి జోలించి పోవ నిన్ను బుట్టించినవానికైనఁ దరము గాదు.

హను—బాలకా! నీవెంతకఠినముగ వాగుచున్నను నీపై నాకుదయించిన యవ్యాజకరుణాతిరేకము నీమాటలఁ బరిగణింపనీయక ముద్దులుగా నెంచి వద్దఁ జేర్చుకొనఁ బుద్ధిని పుట్టించుచున్నది. నీ వెవ్వఁడవు? నీ తల్లిదండ్రు లెవ్వరు?

మత్స్య—ఆవృత్తాంతము నీకేల? నాతో సంబంధము సేయవచ్చెదవా! నీసంగతి యంతకంతకు నాకుఁ జూపాలుఁగూడ నశ్యకల్లు సేయుచున్నది. నీయట్టి పిఱికిపందతో మాటలాడుటకుఁ గూడ వీరపురుషులకు గౌరవహీనమైన పనియే.

హను—ఆఁ! ఏమనుచుంటివి! క్రూరా! మేరమీరిన వాగాడంబరములతో నాత్మభూషణపరనిందలకు మొదలిడిన నీ ధీరత్వమేనిదియో చూపుము.

మత్స్య—అలా దారికి రమ్ము. ధీరుండవై నిలువుము. పౌరుషమును బయల్పరుపుము. నేను ప్రతిష్టలం బొందఁ జూతుము. ఏమట్లు వెఱ్ఱిచూపులఁ జూచెదవు? బాలుఁడని నీవిదివఱకెవ్వనిఁ దృణీకరించితివో వానిచేతఁ జత్తువనియా!

హను—ఓరీ! వృథాప్రలాపా! ఇంక నీవుండఁ బోవురా!

మత్స్య—ఏమి చేసెదవో?

హను—ఏమి చేసెదనా! ఈ ముష్టిఘాతముచే నిన్నంతకుని చెంతకు అతిథిగాఁ బంపెద.

మత్స్య—(వికారముగా నవ్వి యెత్తిన చేతిని పట్టుకొని) ముందీపట్టుఁ దప్పించుకొనుము తరువాత నన్నుఁ గడ తేర్చుమాట యోచించుకొందుము.

హను—(పెనగులాడుచుఁబోయి కొంతసేపుండిమరలఁబ్రవేశించి) బాలకా! నీధైర్య సాహసబలదర్పంబులకు మెచ్చితిని. నీవెవ్వఁడవు? నీతలిదండ్రు లెవ్వరు? నీయుదంతమును దాచక నాకెఱింగించుము.

మత్స్య—వీరాధివీరా! నేనిదివఱకెందఱిశూరులతో యెదిరించియుంటిని గాని నా పట్టుఁదప్పించుకొని బయల్పడినవాఁడీ త్రిభువనముల నీవొక్కఁడవేకనుపట్టుచున్నావు. నివలె నాకునొకవిధమగు భక్తివిశ్వాసంబులుదయించి నన్ను వేధింపుచున్నవి. వినుము. శౌర్యధైర్యసాహసవిక్రమాదుల భూమండలినిసాటిలేని మేటికీర్తి నినడసిన కేసరిపుత్త్రుండు.

హను—(తనలో) వీఁడు నాపుత్త్రుఁడెట్లయ్యె అయ్యో! నాకెక్కడిపుత్త్రులు? నా బలదర్పములకునోడి నన్ను జయింపచేతఁగాక మాయలనుంచి నేదియోయపకారమునుఁజేయనూహించినట్లున్నది! అక్కటా! ఈ పాతాళలంకవాసులందరు మాయల మారివాండ్రేగదా! వీరినినమ్మఁగూడదు. ఐనసంగతివిచారింతము. (ప్రకాశముగా) బాలకా! అంజనీసుతుఁడస్ఖలితబ్రహ్మచారిగదా! వానికినీవు పుత్త్రుఁడవెట్లైతివి.

మత్స్య—ఆమహానుభావుఁడు తొల్లిసూర్యునికడ విద్యలనభ్యసించువేళ శ్రమచేతఁ గలిగిన చెమటబిందువొకటి వానిదేహంబునుండిజారి సముద్రంబునఁబడ దానిని నాతల్లియగు నొకమత్స్యము మ్రింగి నన్నుంగనియె. అంతట నేనుఁదగురీతి సూర్యప్రసాదముననే విద్యలంగ్రహించి పోషించువారులేక యుదరపోషణార్థమీలోకకంటకుండగు దనుజుఁగేహము నాశ్రయించియుంటిని.

హను—కుమారా! నీచరిత్రము నిక్కమైనదే (కౌగలించుకొని) తనయా! ఆ హనుమంతుఁడను నేనేసుమీ! నా పేరునిల్పితివి. సంతసమయ్యె.

మత్స్య—నమ్మఁజాల! నీసంగతియంతయు మోసభూయిష్టముగానున్నది. నన్ను జయించుటకుఁజేతగాక చివరకిపన్నుగడలోనికిఁదిగితివా?

హను.—కాదు. కాదు. కుమారా! నిజముగా నేనే!

మత్స్య—ఆనాఁడునీవు విద్యలనభ్యసించువేళ నుదయాద్రిమీదనొకపాదంబును హస్తాద్రిమీద నొకపాదంబునుయుంచి యెట్టిదివ్యరూపుతో సూర్యునిభక్తిఁగొలచి యుంటివో యట్టిరూపంబును నాకుఁజూపించినఁగాని నమ్మఁజాల.

హను—అలాగే! రామ. రామ. (అనిధ్యానించితొలుతటియాకారముఁజూపించుచున్నాఁడు)

మత్స్య—తండ్రీ! అభివందనములు. ఆహా! గురువులపట్ల నెట్టి యపరాధంబుఁ గావించితిని. జనకా! తెలిసి తెలియక మీయెడఁ జేసిన నాయపరాధము మన్నించి నన్ను దీవింపుము.

హను—కుమారా! తెలియకఁ జేసినవి నేరములు గావు అందు స్వామిభక్తితత్పరుండ వైనీవు విధాయకకృత్యమును నెరవేర్చుకొనుచుంటివి. కీర్తనీయుఁడ వైతివి.

మత్స్య—తండ్రీ! ఎన్నిదినంబులనుండియో జగద్విఖ్యాతుఁడవగు నిన్నుఁ జూడ నుంటిని గాని పరాధీనుఁడ నగుటచే సమయంబు చిక్కదయ్యె. తలవనితలంపుగ మీరే నాపైగరుణఁ గరిగి యిందు విచ్చేసితిరి. జన్మసాఫల్యమాయె. తండ్రీ! మీరిప్పుడిందేల వచ్చితిరి? ఏదియో కార్యార్థమని తెలవచ్చియుండునే!

హను—నాయనా! వినియుందువు గదా అయోధ్యాపురాధీశ్వరులగు శ్రీ రామచంద్రమూర్తి!

మత్స్య—కొంతవఱకు వినియున్నాఁడను.

హను—ఆమహానుభావుఁడు వనుజన దుర్గమమైలంక కేతెంచి దశకంఠుని పుత్రమిత్రబాంధవజనంబు లనంతమొందింప పాపమా దశకంఠుఁడు జయకాంక్ష లేక మైరావణుని సాయమును వేడ వచ్చినాఁడు. మైరావణుఁడు రామలక్ష్మణుల నీరేయి గొనివచ్చి యిచ్చట కాళికాదేవికి బలియిత్తునని దశకంఠునితో శపథముఁ జేసెనఁట!

మత్స్య—సరే! ఈయనగారు మొదటినుండియు నింతే! ఉపాస్తులమారివాఁడా. మాయలమారివాఁడే గాని—సమర్థుఁడే గాని—యుక్తాయుక్తవివేకశూన్యుఁడు.

హను—తరువాత మేమా సంగతి నెఱింగి తగుజాగ్రత్తతో నుంటిమి గాని క్రూరుఁడు మమ్మ మోసగించి మానవనాథులపై మత్తుమందుఁ జల్లి యిచటికిఁ దెచ్చినాఁడు. వారిని వెదుకుకొనుచు నిందు వచ్చితిని. కుమారా! ఆమైరావణుని సంస్థాన మెట్టిది?

మత్స్య—జనకా! ఇన్నిదినంబులు నా వానియుప్పుంబలుసుఁ దినుచు స్వామిద్రోహుండనై వానిగుట్టుమట్టుల మీకెట్లు నెఱింగింతును? అట్టిది మీరడుగఁ గూడదు. కాని యొక్కటిమాత్రముఁ జెప్పెద. ఇక్కడకొంతదూరంబరిగిన యొకతటాకంబు గాన్పింపును. అచ్చట విచారించి తగుకీలకంబులఁ జక్కఁబెట్టుకొనుఁడు.

హను—దీర్ఘాయుష్మంతుఁడ వైయుండుము.

(అని నిష్క్రమించుచున్నాఁడు)





శ్రీ

# హనుమద్విజయము.

—:0:—

## సప్తమాంకము.

పాతాళలంకలోని బాహ్యోద్యానమందలి తటాకము.

ప్రవేశము :— బంగారుకలశముఁబూని గోర్గండి.

గోర్గం—(ప్రవేశించి యాత్మగతమున) అక్కటక్కటా! ఎంతఘోరము? ఎంతమాయాదారితనము? తా జెష్ఠకోతిపనమంతయుఁ బాడుసేయ నూహించినట్లుతన చెలియలగు శూర్పణఖవాక్యానుబద్ధుఁడై కామాంధకారంబునఁ గన్నుఁగానక దశకంఠుఁడు సర్వనాశనమునుఁ గాపించుకొనియె కాంగిరియై కడకు నేటరేపట తనప్రాణములఁగూడ వదల సిద్ధముగనుఁడెతన చావునుఁ దనతోఁ బోనీయక తనయింటిచిచ్చునుఁ బరులకొంపలపైర గులుకొనఁజేసినటుల యేసంగతు తెలుఁగని మాయన్నను బిలచి కల్లబొల్లియేడ్పు లేడిచియేమిమంత్రమునూరిపోసెనో మాయన్న కామందులు తలకెక్క వానిబోధనలకులోనైతగిదని చెప్పిన ప్రాణసఖి మాటలనైనఁ బరిగణింపక గట్టికాపుదలలో గాఢనిద్రాపరవశులైన రామలక్ష్మణులపై మచ్చుమందుఁ జల్లి సేవకులమాయఁ బుచ్చి కాళికాదేవీయాలయమందునిచి ప్రాతఃకాలమున బలినియ్య నుద్యుక్తుఁడై యభిషేకజలంబులఁ గొనిరా నన్ను నియోగించె. అయ్యో! ఏమిసేయుదు? ఇనుమునుఁ గూర్చియగ్నికి సమ్మెటపేటులమరినటుల మైరావణునిమూలమున నాప్రాణములమీదికిఁగూడ వచ్చినది. అన్నా! మైరావణా! కుడిచికూర్చుండి చేజేత నెట్టిదురాగతంబునుఁ జేయ సమకట్టితివి నీకిది యేటి వెఱ్ఱి? ఎందరెన్ని రీతులఁ దెల్పినను మంకుతనమును మానక మమ్మందరిఁ గూడ మాయముఁ జేయింపనూహింపుచుంటివిగదా! వీరావేశముచే వీరాధివీరులగు రామలక్ష్మణులబలము చలమును నీవు తృణప్రాయముగాఁ జూచుచుంటివి. దశకంఠుదశనైనఁ దలంపలేకఁ బోయితివా? చెట్టు చెడుకాలమునకుఁ గుక్కమూతిపిందెలు పుట్టునన్నట్లు యంతమునకే నీకీదుర్బుద్ధి పుట్టెను. లేకున్న నేబట్టినకుందేటికి మూడేకాళ్ళందువా? ఓరీ! మూఢా! ఎట్లో మాయోపాయంబున రామలక్ష్మణులఁ దెచ్చితిగదాయని విఱ్ఱవీగుచుంటివేమో? ధీవరులగు వారలీవార్తనెఱింగివచ్చి నిన్ను

మట్టుబెట్టకుందురా? అట్లుజరుగకున్నను నీవు కాళికిబలిపెట్టునంతలో రామలక్ష్మణులు మూర్ఛఁదెలసి నీప్రాణములఁదీయకుందురా? (ఆలకించి) ఏమనుచుంటివి! నన్నధికప్రసంగమునుమాని వేగమేనభిషేకజలంబునుఁగొనిరమ్మనియా! (తిరిగియాలకించి) మరల నేమనుచుంటివి! లేకున్న నన్నుఁగూడ కాళికిబలినిత్తుననియా! సరిసరి. పాపాత్మా! ఎట్లును నాప్రాణము దప్పించుకొనఁజాలని నేను దుర్మతివియు యుక్తాయుక్తవివేకశూన్యుండవునగు నీచేఁజావనేల? విధివిధానము సరిగానున్నచో నీకు నాకుఁగూడ శ్రీరామునిచేతనే చావు సిద్ధించునుగాక! వృథా నీచేఁజావనేల? ఇదేపోవెద (పోవుచు) హా రామా! సుగుణధామా! పరంధామా! దీనముఖంబూని భ్రమసి వసించు విహితచందంబున నీపాలఁబడిన మమ్ముఁ రక్షింప నీవుగాక మఱెవ్వరున్నారు. రక్షణను ముందుమానుకొని తదుపరమమ్ము రక్షింపఁజూడుము (పరికించి) ఇదేమి? మందమతినై ముందువెనుకలరయక పందయగు మైరావణుని మోహనలంబునఁబడి ప్రమత్తుట కాలస్యమొనరించుచుంటిని. త్వరగాఁబోయి జలంబులఁగొని చని కాళికాలయమున మాయన్న రాకకై వేచియుండెదఁగాక! (వెళ్ళు) ఇదియే మాయన్న నిరూపించినతటాకము.

హను—(ప్రవేశించి జనాంతికముగ) అయ్యారె! కుమ్మరియావములో బంగారు రకులు దొరకిన చందంబున నీదనుజవీటిలో రామనామస్మరణను జేయుచువారి కత్యంత పరితపించు పుణ్యాత్ములు చూపట్టుచుండిరి. అట్టివారెవ్వరైయుందురో? (యోచించి) ఒక్కవేళ దశకంఠుఁడు తనవిజయమునకై నాశపీడి జానకిపై మోహమును వదలి రామలక్ష్మణులవధంపనూహించినచందంబున సీతామహాదేవినిఁగూడ నంతమొందింప నీమైరావణునిపాలికంపఁ నాయమ నాథునిపాలై ఱెంగి దుఃఖించుచుండెనేమో! అదెట్లుసాధ్యమగును? పరులచే వధింపఁబడవలసిన వనితను నిర్బంధమున నుంచక స్వేచ్ఛగాఁదిరుగనిత్తురా? స్వేచ్ఛగావదలినారని యూహింపనేల? అశోకవనమందుంచినట్లు గట్టికాపుదలతో నీవనమునం దెచ్చటనైన యుంచియుండఁగూడదా! కాదు. కాదు. జానకియుసత్యాకల్ల. అచ్చట త్రిజటాదేవి చందంబున నిచ్చటమాత్రము సాధ్వీమతల్లులుండగూడదా! ఇంత యోచించనేల? చూచి నిర్ణయించెద. (పరికించి) అదుగో! నాదెసనొక రాక్షసాంగన యూపుకజలకలశంబునుఁబూనివచ్చుచున్నది గాని పరులెవ్వరుగనుపించరు. ఈసాధ్వియే శ్రీరామనామస్మరణఁగావించిన పుణ్యశాలిన్యై యుండనోపు! (సమీపించి) అమ్మా!

ఉ॥ ఎవ్వరిదానవీవు? జల • జేక్షణ నీదునివాసమేది? త్రా
కుర్వ్యమునామమేమి? కుల • గోత్రములెట్టివి? నాథుఁడెవ్వఁడే
విర్వ్యధినుంటిదానవయి • యిట్టులరాఁగతమేమి? తల్లి! నా
కువ్విలిలూరుచున్నయది • యున్నదియున్నటులానతీయవమ్మా! ॥

ఈల్లీవనమునఁబుట్టిన మల్లెరీతిఁగవలనిర్దయస్వాంతులై శ్రీరామచంద్రునకాజన్మ శత్రువులగు యీదనుజవీటిని నెవ్వరో శ్రీరామస్మరణనుగావింపుచుండిరి. అట్టిపుణ్యాత్ములెవ్వరో నీకు తెలిసియుండినచో నాకుఁ దెలియపఱచెదవే!

దౌర్గం—మహానుభావా! నీవెవ్వఁడవో మాపురంబునకుఁగ్రొత్తవానివలెనున్నావు. ఏ కారణంబున నీవీవీటికేతెంచితివో నిక్కముదాపకముండ తెలింగింపుము.

హను—తరుణీమణీ! నేనొకకార్యార్థినైవచ్చిన దేవదూతను,

దౌర్గ—మాకు సహజవిరోధులగు దేవతలు నిన్నిచ్చటికిఁబంపునంతటి యవసరకార్యమేమైయుండెనో?

హను—అది నేనిప్పుడు చెప్పరాదు. తదుపరి నీవే గ్రహించఁగలవు మానినీ! నిన్నొకసంగతి సహాయమవసరముకలిగినది. నీవును దాచక నిక్కము తెలింగించెదవా!

దౌర్గ—తెలిసినవిషయములో నిజము నేవక్కాణించెద.

హను—ఇంతకుముం దొకకాంత రామస్మరణఁగావింపుచునిటువచ్చినది. నేపరాకుగానుండి యామెపోబడినినిరూపింపనైతిని. ఆమెయెవరు? ఇప్పుడెందేగెనో చెప్పఁగలవా!

దౌర్గ—చెప్పరానిదేమి? ఆమెయెందోపోవలేదు. ఇందేయున్నది.

హను—నీవేనా? సరి. అమ్మా! దనుజకులంబునఁబుట్టిన నీకు రామస్మరణఁగావించునంతటి భాగ్యంబెట్లుగలిగె?

దౌర్గం—"రామా"యనియనుటయుఁగూడ భాగ్యంబేనా?

హను—ఆఁ! నిశ్చయముగా భాగ్యంబే! పూర్వజన్మపరిపాకంబునగాని యట్టిభాగ్యంబు లభింపదు.

దౌర్గ—అయ్యా! ఆరాముఁడెవఁడు?

హను—దుష్టజనశిక్షణ శిష్టజనరక్షణకొరకై భూమినవతరించిన శ్రీమన్నారాయణుఁడే ఆతఁడు.

దౌర్గ—దశకంఠునిసంహరింపవచ్చిన యాతఁడేనా నీవిప్పుడనిన రాముండు!

హను—అవును. తల్లీ! అవును.

దోర్ద—నీవు దేవదూతవనిగదా చెప్పితివి. ఆ రామునకు నీకు సంబంధంబెట్లుగలిగె? ఆతనినీ వెట్లెఱింగితివి?

హను—ఆమహానుభావు నెఱుంగనివా రెవ్వరు?

దోర్ద—నీవిట కేలవచ్చితివో యిప్పుడైనఁ జెప్పవచ్చునా?

హను—కొంచెమునిదానించినఁ జెప్పెదను. అదియట్లుంచుము. నీవీ యర్ధరాత్రమున నొంటరిగా నిందుసంచరించుటకుఁ గారణమేమి?

దోర్ద—రాత్రించరులమగు మాకు రాత్రియనుసందియమేల? జలములకొఱకు వచ్చితిని.

హను—ఎందులకు?

దోర్ద—కాళికి నభిషేకము నొనరించుటకు.

హను—ఎవరు?

దోర్ద—మా రాజేంద్రుఁడు, మాఅన్న. ఈపాతాళలంకేశ్వరుఁడు. మైరావణనామధేయుఁడు.

హను—(స్వగతముగ) కొంత మేలయ్యె! (ప్రకాశముగా) అతఁడీవ్రతము ననిత్యము నొనరించునా? లేక క్రొత్తగా నేఁడు సంకల్పించెనా?

దోర్ద—ఆ! చండికేశ్వరికిఁ బలి పెట్టనుండునపుడెల్లనిట్లే చేయుచుండును.

హను—నేఁడేమిబలి పెట్టనుండె?

దోర్ద—శ్రీరామలక్ష్మణులఁట- దశకంఠునివైరులఁట—దనుజకులహంతకులఁట.

హను—(స్వగ)హృదయమా! తొందరపడకుము. (ప్రకాశ) మాతా! ఆతనియుద్యమము నందరు మెప్పుకొనియున్నారా? నీవును సమ్మతించితివా? ఈమైరావణునకు రామలక్ష్మణు లెట్లపకారులైరి?

దోర్ద—రాముఁడు దనుజవైరియనిపించితివే? మాయన్నయు దనుజుఁడగుటనాతని కేల కాకుండును. ఇఁక నాసమ్మతివశముగఁ బనిలేదు. రాజాజ్ఞ నిర్వర్తింపకఁ దప్పదు.

హను—మీరాజునకు హితముపదేశించువారీవీట లేరా?

దోర్ద—ఉండిలాభమేమి? చెప్పఁగల్గినంత చెప్పిరి. రాముని మహిమాతిశయముల మేము వినికనినంత విన్నవించితిమి. ఫలితము లేదయ్యె.

హను—కానిమ్ము. ఫలితమనుభవింపఁగలఁడు. ఎప్పుడుబలి పెట్టును?

దోర్ద—ప్రాతఃకాలమునఁ గే? అతఁడు వచ్చులోపలనే నభిషేకజలములఁ గొనిపోయి సిద్ధముగానుండవలెనని యాజ్ఞ.

హను—ఆరామలక్ష్మణులనిప్పుడెందుంచినాఁడు?

దౌర్గ — కాళికాదేవిగుడిలోనే భద్రముగా దాచియుంచినాఁడు.

హను — దయచేసి ఆచోటు నాకుఁ జూపించెదవా?

దౌర్గ — అది పరులకు భేద్యము. ఆ మైరావణునకుఁ గాళికిని గాక తదన్యులకుఁ దెలియఁబడదు. ఓయీ! ఆ రాముని నీ వెఱుంగుదునంటివే? అతని సైన్య మెందుఁ బోయినది? మా యన్నకు వానినిఁ గొనిపోవు టెట్లయ్యె? పాపము! ఆ సంగతి వారికిఁ దెలిసెనో లేదో? సకలలోకసన్నుతులగు మనుజవిభులకు క్షణములో గొప్పముప్పు రానున్నది గదా! ఆ పుణ్యపురుషులఁ గాపాడ ధీరు లెవ్వరైన నిందు వచ్చినవారికి నా చేతనగు సాయముఁ జేతును గదా! ఓయీ! దేవదూతా! నీ వైనఁ ద్వరితముగ నేగి యీ సంగతి వారి సైన్యనాథునకుఁ జెప్పుదువా; నీకు మేలయ్యెడిని.

హను — అమ్మా! మీ కులమునకే విరోధియగు వానికై నీకింత నిండారు ప్రేమగలుగుటకు హేతువేమి?

దౌర్గ — అయ్యా! అది నేఁ జెప్పఁజాలను. దానికి దైవము, వారి సుగుణసంపత్తులే కారణములని యూహించెద.

హను — ఔను! సద్గుణము లెచ్చటఁ గూడ పూజనీయములే గదా! అమ్మా! ఇంకొక మాట. వారినిఁ గాపాడువారున్న నీవు తగు సాహాయ్యముఁ జేసెదనంటివే! నిశ్చయమే నా? కాక నీవును మామలమారీమాయన్న చందంబున నన్ను మాయఁజేసి నా యంతును గనుఁగొన నీ మాటలాడుచుంటివా!

దౌర్గ — త్రికరణశుద్ధిగాఁ జెప్పుచున్నాను. కావలెనన్న శ్రీరామచంద్రుని పాదములంటి బాసఁ జేయుచున్నాను.

హను — మాతా! ఇంక దాచనేల? నేనా శ్రీరామలక్ష్మణులదాసుఁడ. హనుమంతుండను పేరిఁటివాఁడ. ఆ మానవనాథులఁ గాపాడుటకై నిందు వచ్చితిని. తడయక నిచటి యుదంతము నెఱింగించి పుణ్యముఁ గట్టుకొమ్ము.

దౌర్గ — హనుమంతా! వాఁ డెంతదుర్మార్గుఁడైన సోదరుండగుట వాని యాపత్తు గుట్టుమట్టులు వైరికిఁ బట్టియ్య మనసొప్పకున్నది. ఐనఁ గొంతవరకుఁ జెప్పెద. నీ శక్తి నుపయోగించి కార్యఫలముఁ గాంచుము. ఇచ్చటికిఁ గొంతదూరమున నొక్క పెనుగంట వ్రేలాడుచుండు. దానిచుట్టును నవకోటి రాక్షసులు కావలియున్నారు. పైని యెవ్వరైన నందుఁ జొచ్చిన నా గంట దానంతట యదే మ్రోగును. వెంటనే రాక్షసులు వచ్చి వానిఁ గవయుదురు. వారలఁ దప్పించుకొనుట యే దుస్తరము. ఒకవేళ తప్పించుకొని యావలఁ బోయిన వింతయగు తులాయంత్ర మొకటి యుండు. అచ్చటఁ గూడ సహస్రకోటి రాక్షసులు కా

పుండియున్నారు. వైపులారంధ్రమును దాటయత్నించిన నడిమి తెగిపడును. అంత కా కావలియున్న వీరులు వచ్చి పైఁబడుదురు. వారలజయింప బ్రహ్మకైనఁ దరంబు గాదు. ఈ రెండు గండములు గడచిన పిదప జరుగఁదగు సంగతులు విన్నవించెద.

హను — మానినీ! దానిమ్మని ప్రార్థించిన సత్తురూకనిను ధార్మికుని చందంబున నతి కష్టతరమగు సంగతినిఁ జెప్పితివి గాని దాని దాటు విధము నుపదేశింప వైతివి.

దోర్ద — (తనలో) ఈతని నెట్లైనఁ గొనిచని ముందు రామలక్ష్మణులఁ గాపాడవలయు నా కట్టి విపత్తు వచ్చిననుసరే! (ప్రకాశముగా) ఆంజనేయా! నీ వింత ప్రార్థింపఁ బనిలేదు. ఎట్లైన నిన్నుఁ గొనిచనియెద. ఆ రాక్షసుల వలనఁ గలుగఁబోవు విపత్తుల నుండి నిన్ను వేగా పాడుకొనుచు నన్నుఁ గూడ గాపాడవలయు. దానికిఁ జాలుదు వేని కార్యారంభమునకు గడంగుము.

హను — తల్లీ! ఆ సంగతి నెఱుంగక నే వచ్చితి ననుకొంటివా?

దోర్ద — మండూక రూపధారివై యీ కలశంబునఁ బ్రవేశింపుము.

హను — మంచిది. (అటులఁ గావింపుచున్నాఁడు)

దోర్ద — ఇఁక రామలక్ష్మణులు బ్రతుకఁగలరని యూహించెద. అయ్యో! అప్పుడే యెట్లు నిరూపింపనగు. వీని సామర్థ్య మెంతలోనున్నదో? పోవుచున్నది శత్రుమండలి. చేయుచున్నది వారికిఁ బ్రతికూలమగు కార్యము (ఆలోచించి) కోటిలోఁ దల దూర్చి కోకంటిపోటునకు వెఱువరాదు దైవసహాయమునకుఁ బ్రతికూల మెద్దియు లేదు (అని పోవుచున్నది. గంట మ్రోగును రాక్షసులు కోలాహలముతో ప్రవేశింతురు)

రాక్ష — అరరె! దుర్మార్గులారా! మీ రెవరు? మా యాజ్ఞ లేక మీ రిందు రాఁగత మేమి? ఓహో! నిశాచర సైనికులారా! రండు రండు. పట్టుకొనుఁడు. నెట్టుఁడు కొట్టుఁడు. చీల్చుఁడు. పేల్చుఁడు. (పరికించి చూచి) ఏమీ చిత్రము? దోర్దండి తప్ప పర లెవ్వరు లేరు. గంటయు చిత్రముగా మ్రోగినది. ఆశ్చర్యముగా నున్నది. ఈ పాపాత్మురా లెవనినైన మిండగానినిఁ దెచ్చుకొనుచున్నదేమో! ఓసీ! దుర్జాతీ! పరు లెవనిఁ గొనివచ్చితివి? నిజముఁ జెప్పుము. లేకున్న నిన్నుఁ జంపెదము.

దోర్ద — అన్నలారా! నన్ను న్యూరాలిగా భావించి పైఁబడవచ్చెదరేల? నే నెవ్వతెను గొంటిని? మా యన్నగారి యాజ్ఞమెయి కాళికాదేవికి నభిషేకజలంబులఁ గొనిపోవుచుంటిని. చూడరాదా? ఎవ్వరున్నారు?

రాక్ష — చాలు. నోరుమూయుము. పరు లెవ్వరు రాకున్న గంట మ్రోగఁ గారణ మేమి? నిన్నావలనొక్క యడుగైనఁ బెట్టనీయము. నిజం జెఱింగించి కదలిపొమ్ము.

దొర్ద—అన్నలారా ఆఁడుదాని నేటికి బాధించెదరు? అందు మీకేలికయగువానితోఁబు
ట్టువను. మీవలె రాజాజ్ఞమీద నేగుచున్నదానను. వృథాగా నన్నిట నిలుపకుఁడు.
ఆలస్యమైన కార్యవిఘ్నము కాఁగలదు. కార్యవిఘ్నమైన రాజుచేత మాట రాఁగలదు.

రాక్ష—మాకీముద్దులతోఁ బనిలేదు నిన్నుఁ బూర్ణపరీక్ష చేసినఁగాని పోనీయము. నీకై
నీవు నిజమెఱిఁగించి వానిని మాకుఁ బట్టియిచ్చి ప్రాణంబులతోడఁ బొమ్ము.

దొర్ద—అయ్యో! ఆ దేటియాగడము? ఇందఱికన్నులకు గంతగట్టి నొక్కయాఁడుదా
న నెవ్వనిఁ గొనిచనఁగలను. మిమ్మేమఱచి తీసుకొనిపోవలసినంతటియాప్తులు నాకెవ్వరు
న్నారు? నన్నేల రట్టులఁ బెట్టెదరు?

రాక్ష—ఎవ్వనిఁ గొనిపోకున్న నేటికీ లయమునకుఁ గారణమేమి?

దొర్ద—ఇది యా సంగతి! అయ్యలారా! దానికిఁ గారణముఁ జెప్పెద వినుండు. కాళికా
దేవికి బలిపెట్ట రామలక్ష్మణులను మానవాధముల మాయన్న దెచ్చియుండలేదా?

రాక్ష—ఛీ! వాగకు. రాక్షసులారా! చూచెదరేల? యీముండ మోపి యెవ్వనినో
మిండగానిని లోఁ గ్రోలి శూర్పణఖవలచినట్లు నరించి కొనివచ్చుచున్నది. పూర్ణపరీక్ష
సేయనిదె విడువరాదు. చూడుఁడు. చూడుఁడు. (అందరు పైగవసి యిటునటులాగు
చుండఁ డిల పైఘటము క్రిందఁబడి దానిలోకప్ప బయలుపడుచున్నది.) చూచితిరా!
కప్పగాఁ జేసి ఘటములోనుంచుకొని పోవుచున్నది ఓసీ! గయ్యాళీ! నేనేమెఱుం
గనని బొంకుచుంటివే? ఇదియేమిటి? నీ ఘటములోని కెట్లు వచ్చినది?

దొర్ద—రక్కసశ్రేష్ఠులారా! తటాకములోనుండి కుండలోని కెక్కినదేమో? నేనేమె
ఱుంగ.

రాక్ష—ఛీ! నోరుమూయుము. (గుద్దుచున్నారు)

దొర్ద—రామా! రామా! రక్షింపుము. రక్షింపుము.

రాక్ష—ఛీ! ముండా! రాముఁడెవఁడే? నీ మిండగాఁడేనా?

హను—(కప్పరూపము నువదలి నిజరూపముతో) ఓరోరి! దనుజకులహతకులారా!
పాపీ లెమ్మని యెంతపైరించిన మీ యాగడబుద్ధి మానక నాఁడు దానిని బాధింప
నుంటిరి? రాముఁడెవఁడో యింకను తెలియలేదుగా! ఏమిరా మీమందబుద్ధి! దను
జాంతకుఁడై భూమిని జన్మించి దశకంఠుని పుత్రమిత్రబాంధవుల నంతమొందించి
నేఁడు మిమ్మును మీరాజునుఁ గూడ వధించి భూమిని నరాక్షసం బొనరింపవచ్చిన
శ్రీమన్నారాయణుండురా! వేరొకనెపంబున నిందుఁ జేరి కాళికాదేవీ యాలయంబు
న విడిసియున్నాఁడు.

రాక్ష—ఏమిరా! కోతీ! దొంగవేషంబున నగర ప్రవేశ మొనరింపఁ జూచినదే గాక తగదని చెప్పవచ్చిన మమ్ముల నిందింప మొదలిడితివా? క్షణములో నీ వేమయ్యెదవో యోచించుకొని కాచుకొని యుండుము.

హను—ఏమయ్యెదనో మీరే యోచించుఁడు. (అని రాక్షసుల పైఁబడి హత మొనరించుచు చున్నాఁడు)

దోర్దు—(తనలో) ఆహా! ఏమి యీ వనచరుని ధైర్యసాహసములు! ఒక్కొక్క వ్రేటునకుఁ గోటానకోటుల రాక్షసుల మర్దించుచున్నాఁడు. అబ్బా! క్షణములో నెందరు యోధులు హతమైరి. సర్వశూన్యముఁ గావించినాఁడే! ఈ వార్త నైన ప్రభునకుఁ జెప్పువారైన నుందురో? లేదో?

ఒక రాక్ష—(తప్పించుకొని ముందునకు వచ్చి) తెలుపువారు లేకేమి? పాపిష్టి గండా! స కతన గాదే మాకీగతి పట్టినది! చూచుము. రాజుతోఁ జెప్పి నిన్నేమి సేయింతునో? కోతి మొగఁడా దొంగతీకెగదా యని కులుకుచున్నావు గాఁబోలు! (ఆలకించి) అదుగో! కోతియిటే వచ్చుచున్నాఁడు. కంటఁబడితి నా చంపక విడువఁడు "శీఘ్రం గచ్ఛ పలాయంతి" యనునట్లు కాలికి బుద్ధి జెప్ప రాజునకీ వార్త తెలియింగించెద. (పరుగిడుచున్నాఁడు)

హను—(ప్రవేశించి) తల్లీ!

చ॥ అరనిముసంబులో దనుజు • లందఱినిన్ వధియించినాఁడ నీ
కరుణను; ముందుగాఁ దగిన • కార్యములో యిఁకఁ జాలనుండెనో
తరుశికో! రామలక్ష్మణుల • దాచిన దెచ్చట? కాళికాలయం
బరయఁగ నెందునుం డెనోర • యంబునఁ జూపుము చూడఁ గోరెదన్ ॥

దోర్దు—ఓయీ! యిల్లలుకఁగనే పండుగయ్యెనదనుకొంటివా? ఆ దేవాలయముచుట్టు లెక్కకు మీరిన రక్కసులు కావలియున్నారు.

హను—ఎందరుండిన నేమి? వీరిగతియే వారికిని గాఁగలదు. వారికాదు. మాతృవారికి మించినవారు నిమసమునకుఁ గోటానకోటులు పుట్టివచ్చుచున్నప్పటికిఁ బుట్టినవారిని బుట్టినట్లే హత మొనరింతు.

దోర్దు—అంత సాహసుఁడవే యగుదువు. హనుమంతా! అదె కనఁబడుచున్నదే కాళికాలయము. అచటికేగుదము రమ్ము.

హను—మంచిది. (ఇద్దరు నిష్క్రమించి కాళికాలయము దాపునకుఁ బోయి) తల్లీ! చూచితివా రక్కసులే మైపోయిరో! అదుగో! జగజ్జనని—లోకమాత—యెంత తేజోవంతముగాఁ బొడఁగట్టుచున్నదో! హా! జగదంబా! పూతచరితా!

క॥ కాళీ! దేవస్తుతగుణ
పాళీ! కరుణాతిరేక పరి ♦ పాలితభ
క్తాళీ! రక్షోగణావన
కేళీ! నిన్నాదనునమ్మి ♦ కీర్తింతుగదే! ॥

హా! తల్లీ! నిజభక్త మానసకల్పవల్లీ!

ఉ॥ పాతకుఁడైనరావణుఁడు ♦ భానుకులాంబుధిసోమురాముని
ఘాతకవృత్తి నీకుబలి ♦ గానిడఁదెచ్చెను మామపుచ్చి; వాఁ
డీతరి రామలక్ష్మణుల ♦ నెచ్చటనుంచెనొ చెప్పుమమ్మసం
ప్రీతిఁగూర్పుమమ్మ నిను ♦ వేఁడెదనమ్మరొ భక్తితోడుతన్ ॥

సీ॥ శ్రీరాజరాజేశ్వ ♦ రీగిరీశ కుమారి
కరుణఁజూడుమదంబ ♦ కాళికాంబ!
విజితాబ్జదళనేత్ర ♦ వివిధసంస్తుతిపాత్రి
కరుణఁజూడుమదంబ ♦ కాళికాంబ!
శ్రీసద్గుణాన్వితా ♦ శ్రితజనపరిపోష
కరుణఁజూడుమదంబ ♦ కాళికాంబ!
అలినీలకుటిలాల ♦ కా సర్వమంగళ
కరుణఁజూడుమదంబ ♦ కాళికాంబ!
అఖిలవేదాదివిమల వి ♦ ద్యాప్రవీణ
వినుతయోగీంద్రపాలిత ♦ గుణకదంబ!
ధీరనుతగుణనికురుంబ ♦ శారదాంబ!
కరుణఁజూడుమదంబశ్రీ ♦ కాళికాంబ! ॥

తల్లీ! నిన్నునేనెన్నివిధంబులనస్తుతించిన నారోదనమరణ్యరోదనముఁగావించినాఁడఁ ప్రసన్నురాలవుగాకున్నకారణమూహింపఁజాల. ఆఁ—! తెలియుటకేమున్నది?

చ॥ దనుజులవీటిలోన సత ♦ తంబువసింపుచువారినేస్తమే
ఘనమనివారిదాస్యమునె ♦ గైకొనుచుండెడినీరువారివ

ర్తనలెలభించుఁగాక వితథంబుగ మంచిగుణంబులబ్బునా
పనిగొని కొంతిపట్టు సహవాస మొనర్చినవారు వీరలా॥

ఇట్టినీవిక్రుతపు నడవడినరయలేక

చ॥ జననివి, లోకపూజ్యవు, ప్రశస్తగుణాన్విత సాధుమార్గసం
జనితవు, శిష్టరక్షణ ప్రశంసితమానసవార్యపక్షునీ
వనుచుఁదలంచి నమ్మితిన మారొ! నిజంబును జూడనిమ్మఁబో
లిసయపినీతి చిత్తఁగన లేరు జగంబున నెందుఁజూచినన్॥

కావున.

చ॥ అనువగుభక్ష్యభోజ్య పరమాన్నములాది సువస్తుజాలముం
గొనక నిశాచరాధములు గూర్చెడునామధుమాంసభక్షణం
బునమది బొంచిచాలకది పూజ్యుఁడు శ్రీరఘురామచంద్రు పా
వనమగుజీవముం గొనఁగఁ బాల్పడఁజూతువె కాళికేశ్వరీ॥

నీచరిత్రము నిందాస్పదంబుగానున్నది. నీయందుభక్తివిశ్వాసములుంచఁదగినదానవు కావు. నీయాసరా లేనిదీమైరావణుఁడీ ఘోరకార్యమునకుఁగడంగడు. కాని యమ్మా! దుష్టులను సాధులఁజేయుటకేదిమార్గం బాయదినే నెఱుంగకపోనేదు. ఓ చండికేశ్వరీ! నేపలుమాటలాడువాఁడను గాను. ఇదే! నాకడసారివాక్యమాలింపుము.

గీ॥ క్షణములోపల శ్రీరాము చంద్రులక్ష్మ
ణప్రభులఁదెచ్చి సుఖముగా నాకుఁ జూప
కున్న వధియింతు నుగ్గియింతు నిన్నుఁగూడ
దనుజహతకులతోపాటు తప్పకుండ॥

అటులఁజేయకున్న శ్రీరామచంద్రుని పాదంబులకుఁదప్పినవాఁడనే! నా బలపరాక్రమంబులు నీ కెఱుంగనివి కావు. మూగిమొద్దువలె నోరుమెదల్పకయున్నమాత్రమున నిన్నుమాయకురాలినిగా భావించి విడిచిపుచ్చునని భావించితివేమో? అట్టియడియాశఁబొందకుము.

(కాళిప్రత్యక్షమగుట)

కాళి—హనుమంతా! నీవంతవాఁడవే యగుదువు. నీబలము, చలము నే నెఱుంగనివి

కావు. రామలక్ష్మణులు సుఖులైయున్నారు. ఇంతవరకు వారికెట్టియాపదలు రాలేదు. ముందు రాఁబోవు.

హను—లోకమాతా! నావందనములందుకొనుము. కార్యాశక్తుఁడనగుట ముందు వెనుకలరయక నిన్నుదూషించినయజ్ఞానమును సైరింపుము. (ఆలకించి) అమ్మా! ఆకోలాహలమేమి?

కాళి—మైరావణుఁడు నీరాకడ నెఱింగి నీచేదములవిని నిజసైన్యనాశనమునకోడి తోఁకఁద్రొక్కిన త్రాచుమాడ్కి వడి మండిపడుచు సైన్యసమేతుఁడై నీపైదాడివచ్చుచున్నాఁడు. అతని నెదుర్కొన నేగుము.

హను—తల్లీ! ఎందరువచ్చిన నాకేమి? శ్రీరామచంద్రునికరుణయు, నీయండయు నాకుండునంతవఱకు నాకేమియు భయములేదు. ఆదానవుని ధైర్యమెంతవఱకున్నదో కనుఁగొనివచ్చెద. నేవచ్చునందాక రామలక్ష్మణులతోపాటీద్రోద్దండినిఁగూడ కాపాడచుండుము. జాగ్రత్త. దానవుఁడేమైనమాయఁజేయవచ్చునేమో? (అనియూపస్తంభమునులాగికొనిపోవుచున్నాఁడు)

ద్రోద్ద—(సైన్యముఁ బరికించిచూచి) ఔరా! మైరావణునిపటాటోపము! వందిజనగాయక, వైతాళిక, మార్దంగిక, వంశాదిక, మాగధిజనంబులు గొలువ నర్తకజనంబులు నృత్యంబు లొనరింప భేరీపణవడక్కాదులు మ్రోగ నిరుగెలంకుల రథబృందంబులు, సామజఘటలు, అశ్వారోహకులు, కాల్బలంబులు ననేకంబులుగానడువ భైరవముఖ, మేఘవల్లభ, కర్కోటకులాది మంత్రివర్గంబులు కంచురథంబులపయిఁబరివేష్టించియాలోచనలు చెప్పఁ దానుకనకరథంబుపైఁగొలువుండికదనరంగంబుఁజొచ్చి హనుమంతు నెదుర్కొనుచున్నాఁడు. (చూచి) ఆహా! ఏమీహనుమంతునియుద్ధనైపుణ్యము! ఇండఱొక్కమారుగ దన్నుఁదాకినను లక్ష్యపెట్టక నొక్కొక్కవ్రేటునకు శతకోటి, సహస్రకోటి రాక్షసులను ఖండించి యంతకుని చెంతకనుపుచు, దానవులమాయలకుఁ బ్రతిహతమెసరింపుచు, నేనుంగులపై నేనుంగులచేతను, గుఱ్ఱంబులగుఱ్ఱములచేతనుఁగూల్చుచు రథములవిఱుగఁ దన్నుచు నిముసములో కదనరంగంబును పీనుఁగపెంటలుగఁజేసె. అబ్బబ్బా! ఎంతసాహసము! ఎంతసాహసము! అదే! మేఘవల్లభునిరథముపయికిదూఁకి దానినిఁబట్టుకొని భైరవముఖుని భైరవముఖముగా నెగసిపట్టి వారితలలు రెండు చేతులఁబట్టి తాళమువాయించుచుఁ దదుపరివాలంబునకుఁజుట్టి కర్కోటకునిరథమున కేసిబాదిచంపె. ఇంకనొక్క మైరావణుఁడుమాత్రము మిగిలియున్నాఁడు. పాపమాతఁడు చేయునదిలేక యుద్ధభూమినిఁజూచి గుండెఝల్లన

దిగ్భ్రమఁబడినిలిచియున్నాఁడు. వానిస్థితినిజూచి హనుమంతుఁడేదియో హెచ్చరింపుచున్నాఁడు.

(తెఱలో హనుమంతుఁడు)

శా॥ ఓరీ! దుష్టనిశాచరాధమ! శఠా! • యోపాపభూయిష్ట! యో
క్రూరా! రావణుమాయబోధనలచేఁ • గోల్పోయిసుజ్ఞానముల్
దురాలోచనమూని నీబలముల్గ • దూర్వారబట్టించినా
తీరెట్లాయెనటంచుఁ గుందనగురా • ధీరత్వముల్ జూపకే ॥

సూత్ర—దీనికి మైరావణుఁడేమి ప్రత్యుత్తరమిచ్చునో?

(తెఱలో మైరావణుఁడు)

ఓక్రూర మూఢపశువా!

గీ॥ బక్కరక్కసిమూకల • నుక్కడంచి
నంతమాత్రనె గర్వించి • నధికబలుని
మాయరావణుదోశ్శక్తి • హేయపరుపఁ
జూచుచుంటివె వనచర! • నీచబుద్ధి!

సూత్ర—ఛీ! మాయన్న ప్రత్యుత్తరమంతబాగున్నదిగాదు. పండ్లబింకములాడుమాటలుగాని సరసమైనవిగావు. మఱలహనుమంతుఁడేదియో యనుచున్నాఁడు.

(తెఱలో హనుమంతుఁడు)

ఓరోరి! యాత్మశ్లాఘ పరాయణా! చచ్చినవారు బక్కరక్కసులైన నీవు పోటుబంటువుగాఁబోలు! ఐన నీపోటుతన మేదియో చూపింపుము. వేరుచూపింపనేల? మొదటనే తెలియవచ్చినదిగదా!

గీ॥ కుప్పకుప్పలు గానేలఁ • గూలియున్న
పీనుగల గుంపుఁజూచియే • భీతి గదుర
దిగ్భ్రమును జెంది తుదకొక • దీనుపగిది
నిలచిన విధంబె నీస్థితిఁ • దెలియఁబఱచె!

—కంసుతే!

(తెరలో మైరావణుఁడు)

ఓరి వాచాటా! పీనుగలఁజూచి భీతిల్లితినో, నీయట్టి యధమాధముని చేతఁజచ్చి నవారబేలత్వమునకు వగచుచు నిలుచుంటినో శాఖామృగమువగు నీకుఁ దెలియఁ గలదా! గతించినదానిఁ ద్రివ్వుకొననేల? ఇప్పుడు రమ్ము. నీనాబలంబులఁ జూచు కొందము. (అని హనుమంతుని మీఁదికి దుముకుచున్నాఁడు.)

దోద్ద— (సంభ్రమముతో) హనుమంతా! బళే! నీయుద్ధనిపుణత మెచ్చఁదగినది మాయన్నగారి పెనుగదా ఘాతమును నెంతసుళువుగాఁ దప్పించుకొంటిరి! నీవు గాకున్న మఱొక్కరు దానిం దప్పించుకొనఁగలరా? అదే! హనుమంతుఁడు ముష్టిఘాతముచే మాయన్నను ముప్పతిప్పలంబెట్టి యూపిరిపోవునటులఁ జేసినాఁడు. ఈదెబ్బతో మాయన్న మఱిలేవడు. (పరికించి) ఆహా! మైరావణుఁడప్పుడే స్మృతిఁ దెచ్చుకొని యేమియో యనుచున్నాఁడు

(తెరలో మైరావణుఁడు)

ఓరోఁ! వనచరపాంసనా! తప్పించుకొని యెందుఁబోఁగలవు.

చ॥ నిలువర పోకుపోకుమర • నీబలమెట్టిదో చూడఁగోరి నీ
వలన భయంబు కల్గదను • భావన నేమరి యుండఁజూచియో
తులువ! వినీతివర్తనత • ద్రోహముఁ జేయఁ దలంచినాడవే
బలమగు ముష్టిఘాతమున • బాలిశ! నిన్ను వధింపకుందునే!

దోగ్ద— మయిరావణుండు మాత్రము సామాన్యుఁడా! అబ్బా! ఎంతత్రోపుఁద్రోసినాఁడు! ఎంతఘాతకకార్యమొనరించినాఁడు. ఈదెబ్బతో హనుమంతుఁడు మూర్ఛిల్లినాఁడు. అయ్యో! మాకుదిక్కేది? హా! శర్వాణీ! అలివేణీ! శ్రీరామదాసునికేయాపద రాకుండఁజేయుము. (తిరిగిచూచి) ఆహాహా! హనుమంతుఁడు మైరావణుని వ్రేటును లెక్కసేయక చక్రమువోలె గిఱ్ఱునఁదిరిగి తప్పించుకొనివానిని వాలమునకుం జుట్టి గిరగిరఁ ద్రిప్పి గాలిపటంబులీలఁ బైకినెగరవేయ నంతరిక్షంబున మైరావణుండు సుడిగాలిలోనెగసి పట్టుదొరకని చిట్టికాగితముచందంబున క్రిందుమీఁదగుచు దభాలునభూమిపైఁ దలవేయివ్రయ్యలగునట్లు పడినాఁడు. ఈపాటుచే మైరావణునిపాటు సమసిపోవుటనిశ్చయము. (చూచి)హనుమంతుండేలకో యిటువచ్చుచున్నాఁడు.

(హనుమంతుఁడు ప్రవేశింపుచున్నాఁడు)

హను—అమ్మా! దోర్దండీ! ఈపాపిని యెన్నిసార్లు చంపినను జావక మఱిమఱి లేచివచ్చుచున్నాఁడు. దీనికిఁ గారణముండకపోదు.

దోర్ద— (స్వగ) సోదరుఁడు శంకయగుటచేతఁ జేతులారఁ జంపుకొనవలసివచ్చినది. నేవాని గుట్టునుఁ జెప్పకున్న నేమి? దేవినైన బాధించి తెలుసుకొనక పోఁడు. వృథా నేను కాదన నేల? (ప్రకాశముగా) నిజమే! వానియాయువు వేఱొకచో గుప్తపఱచియుండుటవాఁడు పరులచేతఁ జచ్చువాఁడుగాఁడు.

హను— ఆగుప్తమెట్టిది?

దోర్ద—సప్తసముద్రముల కావలనుదయాద్రియను నొక పర్వతరాజము శోభిల్లుచున్నది. దానికి ముప్పదియోజనముల దూరమున మఱియొక శైలము పదియామడల వెడల్పునంతియు పొడగున నమరియున్నది ఆపర్వతశిఖరమం దేడుగుహలున్నవి. ఆగుహలలో నేడుతుమ్మెదలు విహరింపుచుండు. ఆతుమ్మెదలలో వీనిప్రాణములు గుప్తపరచియున్నవి. ఆతుమ్మెదలనుపట్టి వధించి వరుససప్తసముద్రములలో విధివిధానముగస్నానమొనరించి వచ్చి నీతనిపాలియించిన నొక్కయేటునకే ప్రాణంబులవిడువఁగలఁడు. మైరావణుఁడు నీదెబ్బచే పెనుమూర్ఛలో మునిఁగియున్నాఁడు. మూర్ఛదేఱుటకు నింకొకగడియకాలముపట్టును. ఇంతలోపల నీవాకార్యసాఫల్యముఁ గావించుకొనిరావలయును.

హను — తల్లీ! నేనిప్పుడే తరలిపోయి నీచెప్పినచొప్పునఁ గావించివచ్చెద. నీవిందు జాగరూకతతోనుండుము.

(నిష్క్రమించుచున్నారు)



శ్రీ

# హనుమద్విజయము.

:0:

## అష్టమాంకము.

పాతాళలంకలోని బాహ్యప్రదేశము.

ప్రవేశము హనుమంతుఁడు, దోర్గండి.

హను— తల్లీ! దోర్గండీ! భగవంతుండగు శ్రీరామచంద్రుఁడే నాకు నీసాయమును గలిగించి నాకఖండవిజయమును చేకూర్చినాఁడు. లేకున్న నొంటరిగా నేనిందువచ్చి యీపురమర్మంబుల, మైరావణునిమాయామంత్రతంత్రంబుల రహస్యము లెఱింగి తత్ప్రతీకారములొనరించి రామలక్ష్మణులవాని బారినుండి తప్పించ నాకలవియగునా? నీయుపకారము నాకమోఘమైనది.

దోర్గ— హనుమంతా! నన్నుఁ గీర్తింప నవసరము లేదు. సర్వమును దైవాధీనము. శ్రీరామలక్ష్మణులయందు నీకుఁగల భక్తియే నీకిట్టి విజయమును జేకూరఁజేసినది గాని నావల్ల జరిగినది సుమంతయు లేదు. కావలసిన విధివిధానములకు మనము నిమిత్తమాత్రులమనుట నీకుఁ దెలియదా! నేను గాకున్న మఱియొకరు వత్తురు? ఇంతకు దుష్టనిగ్రహ శిష్టజనపరిపాలకుండగు శ్రీరామచంద్రప్రభుని లీలలు గాని నిజములు గావు. ఈపాపి మైరావణు వధార్థమై నిమిత్తమాత్రంబుగా నేఁడిటులీతనిచేఁ జిక్కినాఁడు గాని లేకున్న నీతని మాయలు వారికొక లెక్కలోనివి గావు. దనుజవధార్థమై భూమి నవతరించినవాఁడగుట నేరీతినో తావచ్చిన కార్యమునుఁ బూర్తిగావించుకొనకుండునా! దానికింత ప్రశంశయేల?

హను— అట్లనరాదు. దనుజవధార్థమై నవతరించినవాఁడైనఁ బ్రకృతినిబద్ధుఁడగుట దేశకాలానుగుణంబులుగాఁ బ్రవర్తించుట దప్పదు. ఇప్పటిస్థితిగతులకు నీసాయమవసరమైనదే!

దోర్గ— దానికేమి గాని కుమారా! నీవేగిన కార్యమెటుల నిర్గించుకొని వచ్చితివి. మైరావణుఁడు మూర్ఛదేరు సమయము సమీపించుచున్నది.

హను— అమ్మా! శ్రీరామచంద్రమూర్తి కరుణయుఁ గాళికాంబ దయయు, నీసాయమును నాకుండునంతవరకు నాకిట్టి కార్యము లెక్కలోనిది గాదు. వినుము. అట్లుమీవా

క్యానుబద్ధుఁడనై యుదయాద్రిచెంతకరిగి నచ్చటకావలి రక్కసులనెల్ల నొక్కత్రు
టిలో నంతమొందించి యుక్కుమిగిలి చెంతనున్న గిరివరంబునకరిగి యాకొండనె
క్కి మీరు చెప్పినగుహాలనేఁడింటిని గనుంగొంటిని గాని యవి బ్రహ్మభేద్యములుగ బంధి
పఁబడియుండుటఁ గనుంగొని యుపాయముఁదోపక నిర్విణ్ణతనిలుచుండ నుస్వరమున
శ్రీరామనామసంకీర్తనంబొనరింపుచుండ నాస్వరాలాపనకు సంతసించి గాఁబోలు
నాతుమ్మెదలు బయటరాఁగా చెచ్చెర వానినొడిసిపట్టి నలిపి చంపివేసి నీ చెప్పిన చో
ప్పునఁ గ్రమముగా సప్తసముద్రములలో స్నానమాడి వచ్చితి.

దోర్ద — సంతోషమాయె. హనుమంతా! ఇఁక మైరావణుండు చచ్చినట్లే!

హను — మాతా! నేనా భృంగముల నన్నిటిని భంగంబొనరించితిగదా! ఆసంగతి వీనికిఁ గోచ
రముగాకుండెనా?

దోర్ద — తెలియకుండునట్లు బ్రహ్మశాపముగలదు. ఈతఁడు పరమదుర్మార్గుఁడగుట నె
ప్పటికేమియగునో యను భీతిచే వాని ప్రాణములమాత్రమచ్చట గుప్తపఱచి
యుండుటకంగీకరించినదిగాని దానిరహస్యము వానికిఁ దెలియకుండునట్లు మూఢునిఁ
జేసినది

(మైరావణుఁడు తెలివో)

మ॥ అనిలోమూర్ఛిలినంతమాత్రముననే • యారోర! నీచేతిలో
దనుజాధ్యక్షుఁడు రావణుండు భువినం • తంబొందెగానంచు నీ
ఘనతన్ జాటుకొనంగఁ జాలితివె బిం • కంబుల్ దగన్ బల్కుచున్
వనవాసీ! ఇఁకఁ జూపరార చలముల్ • బాహార్భటుల్ నాపయిన్

దోర్ద — అహహా! మైరావణుఁడు మదించినమత్తేభంబుకరణి తనపాటును దానెఱుం
గకఁ గ్రోధియై యిటువచ్చుచున్నాఁడు. నేనిందుండరాదు. చిరంజీవి వైకార్యసా
ఫల్యమొనరించుకొనుము. (నిష్క్రమించుచున్నది)

మైరా — (ప్రవేశించి) ఓరోరి క్షుద్రపశువా! వనచరరూపభండాలా!

మ॥ అనిలోమూర్ఛిలినంతమాత్రమున......

(అను పైపద్యముఁజదువుచుఁ బ్రవేశింపుచున్నాఁడు)

హను — రక్కసా! చింతచచ్చినను బులుసుచావలేదనునట్లు నీ ప్రాణములేపోవసిద్ధము
గనుండినదెఱుంగక నోటిబీరములాడుచునా పాటును తెలుసుకొనుమనుచునా వా!

ఎంతవట్టివాఁడవు? ఎంతయవివేకివి?

గీ॥ మాయరావణ! నీదెంత • మందుబుద్ధి
మేలుకీడుల నెఱుఁగక • మిడిసిపడెదు
బలికిఁ దెచ్చిన పశువువే • బట్టిద్వార
తోరణంబును మ్రింగగా • దూకునట్లు!

మఱియు.

గీ॥ గ్రుక్కిడిప్పక మొఱఁగెదు • కుక్కరీతి
మొఱిగినంతనె ఫలమేమి? • మూఢచిత్త!
నోటిబింకము ముందర • వ్రేటుబింక
మగపడదు చూడ నీజన్మ • మంటలయేమొ?

రావ:— ఓరీ! పాపి! తులువా!

గీ॥ అడవిఁ దిరుగాడు మృగము వం • చరసి నిన్ను
ద్రోసివేయు మనుజుఁడనా • దోసమునకుఁ
బెచ్చు పెరుగుచుఁ జెలరేగి • గచ్చుమాట
లాడఁ జొచ్చితె రారర • మ్మసి మొనర్పు॥

ఇంతకు రామలక్ష్మణులఁ గొనివచ్చునపుడు క్షుద్రజంతువులని మిమ్ముఁ గరుణించి విడిచివచ్చిన దోషంబు నాకిప్పుడనుభవమునకు వచ్చినది. అప్పుడే మిమ్ముఁ గూడా నేదేని మాయచేఁ గొనివచ్చి భద్రకాళికి బలిపెట్టిన బాగుగా నుండియుండును. గతించిన దానికిఁ జింతించనేల? నిజముగా నా పొరపాటే నన్ను బాధించుచున్నది. మీ రెవరిని మహామహుఁడని నమ్మి భక్తి సేవింపుచుంటిరో యట్టివాఁడే నా చేతఁ జిక్కె. నిఁక మీరం తప్పించుకొనువారు? ఇప్పుడు మాత్ర మేమించినదేమి? రమ్ము. చిటుకలోఁ మీ శీర్షము ఛిన్నభిన్నంబులుగాఁ జించి ప్రీతిమై భద్రకాళికి బలిహరణ మొనర్తు.

హను:— రావణా! వీరాధివీరుఁడగువాఁడు బలదర్పంబులఁ జూపించుచు ముఖాముఖిని నిల్చి పోరి జయంబునుఁ బొందవలయుఁ గాక మంత్రతంత్రముల మాయలమందుల వైరుల జయింపఁదలపెట్టినంత సాధ్యమగునా? అట్లు గావించినవారెవ్వరు జయంబు గాంచఁగలిగిరో యోచించుకొనుము.

సీ॥ మాయామృగంబైన • మారీచుఁడేపాటి
ఘనతవహించెరా • దనుజహారక!
కడలినిదాటుచోఁ • గనలియుద్ధమువచ్చి
సురసయేమయ్యెరా • క్షుద్రచిత్త!
సంగరభూమిలో • దొంగమాయలమేను
నాథుఁడేమయ్యెరా • నయవిహీన!
కానలోపలమాయ • మానిత్రై గనుపించి
కాలనేమేమయ్యె • జ్ఞానరహిత!
వేగద్రోణాద్రిఁగొనివచ్చు • వేళలందు
మాయఁజేయఁగవచ్చిన • మాల్యవంతుఁ
డెట్టి జయమునుగాంచెనో • యెఱుఁగలేదె?
కాకయుందావెనీవు నా • కరణిఁ యిపుడు॥

మైరం—ఓరీ! అందులకేనా యింతగర్వము! ఆజయము మాయాత్మబలముచేచేకూరి నదిగాదుసుమా!

క॥ కులనాశకుఁడొక్కండే
కులమున్జెరుపంగశత్రు • కోటికిసఖుఁడై
కులమర్మంబులఁదెలుపఁగఁ
గలిగిన విజయంబునెంచి • గర్వింతురొకో!

అందుచేత బెండ్లునీటమునింగి రాళ్లుదేలిన ట్లైనది. ఆకుటిలవర్తనుఁడు—ఆకతిపకర్ముఁడు ఆవంశనాశనకారుఁడు— చేఁజిక్కినశత్రికొకకంచుగాఁగోసి కాకులకుగద్దలకెరయిడ కుఁదునా' వానిసంగతిఁదరువాత చూచుకొందును. ఇప్పుడునీకైనీవునాయెదుఁ బడితివి. నిన్నువదలరాదు.

హను—ఔను! ఆవిభీషణునిసంగతి విచారింపవచ్చును ఇప్పుడునీసంగతి కేవిచారించు కొనుము. చేలా!

గీ॥ పొల్లుమాటల చేఁబొద్దుఁ ● గాచ్చుఁదలఁచి
వదరుచుండుటయేగాని ● ఫలముగలదె?
పోరుఁబోతువు కాదేని ● పోరుసల్పి
జయముఁ జేపట్టిధీరతఁ ● జాటుకొనుము॥

మరల నిన్ను నిట్లు యుద్ధమునకు నాహ్వానించుట నాకుఁ బరువుహీనమే కాని వట్టి జయాపజయంబులతో సంతసించి నిన్నుఁ బ్రాణంబులతో వదలవలసినవాఁడవు కావు. గనుక నీతో మరల దిఁలపడవలసివచ్చినది. రారమ్ము! నీవెంతవఱకు సిద్ధముగనుంటివో చూతును.

మైరా — పోరుఁ బోతువు నీవో, నేనో తెలియఁబోవుచుండ మతిప్రస్తావించుకొన నేల?

గీ॥ కుడువఁబోవుచు రుచిఁ జెప్పఁ ● గోరినటుల
ననుభవింపఁగఁబోవుచు ● నబలరీతిఁ
గానికూతలఁగూయుట ● ఘనతయగునె?
కాచుకొనుమోరియీముష్టి ● ఘాతమునకు॥

(అని పైఁబడి గుద్దుచున్నాఁడు)

హను — ఔరా! ఎన్ని దినములు సాముజేసి యీబలమును సంపాదించితివి. స్వశక్తి పరశక్తుల నెఱుఁగక నీమాయావైదములకు నీలో నీవు మెచ్చుకొనుచు ధీరులతో యుద్ధమునకుదిగితివి. చేతి నైనట్టి ప్రయత్నములఁ జేయుచుంటివి. శక్తికొలంది యుద్ధకౌశలముఁ జూపుచుంటివి. ఫలితము లేదయ్యె. ఓరీ! పందా! యుద్ధమన నేమిగా నెంచితివో?

క॥ మచ్చులమందులఁ జల్లెడు
పిచ్చితనపు విద్యగాదు ● ప్రేలరి! అనిలో
విచ్చలవిడి జరియించిన
వచ్చునురా జయము నెట్టి ● వారికినైనన్॥

నీపరాభావ మెంతవఱకుండునో గనుఁగొనక మొదటనే దుదముట్టించుట మంచిదిగాదని యింతవఱకు సైచియుంటి. ఇప్పటికే చాల తడవైనది. నినుఁబాసిపోయిన నీ మంత్రి, సామంత, పురోహిత, సేనాబంధువర్గంబులు నీకై నిరీక్షించుచున్నారు. వారలకు నీకు నెడము సేయుట బాగుండదు. కయిష్టదైవముఁ బ్రార్థించుకొనుచుఁ బ్రయాణమును గట్టుము.

మైరా — ప్రయాణ మెవరు కట్టుదురో యిప్పుడే తేలును. వేఱుయా యుద్ధములతోఁ బనిలేక ద్వంద్వయుద్ధమున నే దుదముట్టించెద.

హను — రోగిపాలఁ గోర వైద్యుఁడదియే పెట్టుమనినట్లు నేఁ గోరుచున్న దానినే నీవును గోరుచుంటివి. రమ్ము. (అని డీకొనుచున్నాఁడు)

మైరా — (నేలఁ గూలుచు) ఆహా! రామా! రామా! పరులకుపకారము కొఱకుఁ బోయి పరంధాముఁడవగు నీకపకారమునుఁ గావించితి. నన్ను రక్షింపుము. హా హా (ప్రాణములు విడుచుచున్నాఁడు)

కాళి — (మరలఁ బ్రత్యక్షమై) హనుమంతా! మేలు, మేలు లోకకంటకునిఁ బరిమార్చి జగంబులకు మేలొనర్చినవాఁడవైతివి. అదే! దేవతులు నీపై పుష్పవర్షంబులఁ గురిపింపనుండియు బ్రతికియున్న రావణానిభయమున వెనుకాడుచున్నారు. ఇదే! శ్రీరామలక్ష్మణుల గుప్తపరచియున్న మందసము. త్వరితముగఁ గొనిచని రావణవధఁ గావించి లోకత్రయంబులఁ గీర్తిశాలులుగండు.

హను — తల్లీ! నీకరుణయున్న నదిగూడ క్షణములోపని. ఇదె వందన మాచరింతు. నాకు సెలవొసంగుము.

కాళి — మంచిది పోయిరమ్ము. (నిష్క్రమించుచున్నది.)

హను — దోర్దండీ! ఈ రాక్షసరాజ్యమునకు నీపుత్రుని జంబుకేశ్వరుని లంకేశ్వరునిఁ గావొనర్చి మత్స్యవల్లభుని మంత్రిగా నియమించి యీ కాళికాదేవి కృపాకటాక్షములచే సర్వసుఖముల ననుభవింపుము. అటుగాదు నేనే వారికి బట్టాభిషేక మొనరించి పోయెద వారలఁ బిలిపింపుము.

దోర్ద — మహాప్రసాదము. (నిష్క్రమించి వారలతోఁ బ్రవేశించును)

హను — (జంబుకేశ్వరుని పీఠము పైనునిచి) కుమారా! జంబుకేశ్వరా!

క॥ దనుజుఁడవై పుట్టినను
దనుజుల శీలంబు విడిచి ♦ దాక్షిణ్యుఁడవై
వినయ విధేయత మెలఁగుచు
ఘనతరమైనట్టి కీర్తిఁ ♦ గాంచుము ధీరా॥

సుగుణచరిత్రుఁడగు యీ మత్స్యవల్లభుఁడు నీకు మంత్రిగా నుండును. మీరిద్దరు నొద్దికతో నుండి శ్రీరామచంద్రుని కృపాకటాక్షమునకుఁ బాత్రులై నేర్పుతోడఁ గాలముగడుపుఁడు.

## అష్టమాంకము.

జంబు—స్వామీ! మేమిరువురముఁ జిన్నవారము. ఎవ్వరేమికీడొనర్తురో? మీరు మమ్మరసియుండవలయు.

మత్స్య—తండ్రీ! మమ్ముఁ గాపాడ నీవే దేవదేవుండవు. పునర్దర్శనం బివ్వవలయు.

హను—కుమారులారా! మన కెల్లర కేడుగడయగు శ్రీరామచంద్రుని దయయున్నంత వఱకు మీ కెట్టియాపదలు రావు. భయము లేదు ఇప్పుడు విస్తారముగ నిందుండ వీలు లేదు. మరలవత్తు.

ఇద్ద—తండ్రీ! మా వందనములందుకొనుఁడు.

హను—చిరంజీవులయియుండుడు.

(అందరు నిష్క్రమించుచున్నారు.)





శ్రీ

# హనుమద్విజయము.

:O:

## నవమాంకము.

లంకలోని శ్రీరామచంద్రుని శిబిరము.

సుగ్రీవ, అంగద, జాంబవంత, గవయ, గవాక్ష, గంధమాదన
సుషేణ, విభీషణాది వనచరులు.

సుగ్రీ—కపికులశేఖరులార!

చ॥ తెలతెలవారవచ్చెఁగద నేఁటికి మారుతి రాక యెంతకుం
దెలియదు; రామలక్ష్మణుల దెచ్చుచునుండెనో? లేదొ? పాపిమా
యలఁగనఁజాలెనో? గనడొ యక్కట! ఎట్టియమంగళంబుఁ బ
నులఁబడనుండెనో? కపుల నోముఫలం బెటులున్నదో గదా!

అంగ—(ఆలకించి) ఏదియో సింహనాదంబు వినవచ్చుచున్నది. విననాంజనేయుని సింహనాదమువలె నేయున్నది. కార్యానుకూలుఁడు గాక కేసరీపుత్రుండు సంతోషసూచకంబగు సింహనాదంబుఁ గావింపఁడు.

అందరు—నిజము. నిజము. అదుగో! హనుమంతుఁడే! మనహనుమంతుఁడే! అంగదా! ఈశుభవార్తఁ దెల్పిన నీకేమి బహుమతులొసంగువారము. రండు రండు. ఆమహానుభావుని కెదురుగాఁ బోవుదము.

అంగ—అయ్యలార! మనము ప్రయత్నించునంతలోపల వాధీరుఁడే మనలసమీపించినాఁడు. ధీరోద్ధారకా! ఆంజనేయా! నమస్కారములు. నీమోముసంతోషమును సూచించుచున్నది. కార్యము పండేగదా!

హను—(ప్రవేశించి) సుగ్రీవరాజా! నీకును దక్కినపరివారమునకును క్షేమమే గదా! విభీషణా! నీకుఁ గుశలమా!

విభీ—అయ్యా! నాకుశలమున కేమి?

## హనుమద్విజయము.

ఉ॥ క్షేమమె రామచంద్రునకు • క్షేమమె లక్ష్మణమూర్తి కెంతయున్
క్షేమమె నీకు వాయుసుత! • చెప్పుము యచ్చటి వింత లెల్ల నీ
వామయి రావణాధముని • నంతకు చెంతకుఁ బంపి వచ్చితే
క్షేమము చేకురంగఁ దగఁ • జేసితి వే భువి నెల్ల వారికిన్॥

హను — వేలుగఁ జెప్పవలయునా! అందరు క్షేమముగ నేయున్నారు. ఇదుగో! రామలక్ష్మణుల దాచియుంచిన మందసము. కాళికాదేవి నాకొసంగె. (అని మందసముఁ జూపి క్రిందఁ బెట్టుచున్నాఁడు)

అందరు — (గుమిగూడి) విభీషణా! ఆమందసముఁ దెఱువుమీ? రామలక్ష్మణులఁ జూడక క్షణమైన నిల్వఁజాలము.

విభీ — (మందసముఁ దెఱచి) అయ్యలారా! అల్లరి సేయకుఁడు.

క॥ బృందారకులో యనఁదగు
సుందరరూపములు నిద్ర • సోలుచు రఘురాట్
చంద్రులు సుఖముగ నుండిరి
యుందఁగఁ బని లేదు మనకుఁ • గోవిదులారా!॥

వీరి విభద్రంబుగా నెత్తి యాచోట శయ్యపైఁ బరుండఁ బెట్టుడు. అయ్యా! హనుమంతా!

గీ॥ చేసితినో? లేదో! ద్రోహంబు • చెప్పఁగలఁడు
రామచంద్రుఁడు మనపాలి • రాజరాజు
చేసినానని మీ రెంచి • వేసినట్టి
బంధనంబులు నేటితో • వదలఁగలవె!॥

హను — విభీషణా. కోపపడకుము. నేను సత్యముగా నీపట్ల నపరాధ మొనరించినాను. క్షమింపవలయును.

క॥ ఆపదను మున్గియుంటను
కోపము నను చుట్టుముట్టి • కొల్పుచ్చఁగ నే
పాపముఁ జేసితి నీయెడ
సైపుము నా తప్పు లెల్ల • సద్గుణధుర్యా!॥

# హనుమద్విజయము.

విభీ—అయ్యా! నిన్నుతియించునంతటివాఁడనా? నాయాపద దుఃఖు బాపిన నీకు నే ఋణస్థుఁడనైతిని. ఆ ఋణ మెట్లుదీర్చుకొందును? ఆహా! నీశక్తి మహాద్భుతము. నీప్రయాణోదంత మెఱింగింతువా?

హను—అయ్యా! అది కడుచిత్రము. చెప్పెద వినుము.

సీ॥ నీవు చెప్పినగుర్తు • నేబోయి వనరాజిఁ
గంటినట కొలనుఁ • గాంచినాఁడ
నందలి కమలంబు • నరసి గన్గొని దాని
సూక్ష్మనాళంబునఁ • జొచ్చినాఁడ
నదిదాటి యావలి • యధిక ద్వారము దాటి
దోర్దండి ప్రాపునే • దోఁగినాఁడ
దానిమూలంబునఁ • దాఁసు వాకిలి దాటి
శాంకరి గన్గొనఁ • జాలినాఁడ
ఇంతలో పలరక్కసు • లెల్ల గూడి
నన్ను గవయంగ నచ్చిన • సున్న జేయు
మంత్రివర్యులతోఁ గూడి • మాయరావ
ణుండెవెడలఁగ వారినిఁ • జెండినాఁడ.

రాక్షసులనందఱి నొక్కవేటున కేనుక్కడంచితిని గాని మైరావణుఁడు మాత్రమెన్నిసారులు చంపినను జావక మరలమరల లేచివచ్చుచుంట చిత్రముగాఁ దోఁచి దోర్దండిని గారణమడుగ నామె దానిమర్మంబు లెఱింగింపవిని నా చెప్పినచొప్పున నుదయపర్వతంబునకు పరిభాగంబునఁ గల కొండగుహలలోని తుమ్మెదలయందు గుప్తపరచియున్న మైరావణుని జీవసమితినిఁ బట్టి వధించి వానినిదునుమాడి తద్రాజ్యంబునకు దోర్దండికుమారుఁడగు జంబుకేశ్వరుని యాధీనుజేసి మత్స్యవల్లభుని మంత్రిగా నియమించి కాళికాప్రసాదంబున నీమందసముఁ గొనివచ్చినాఁడ.

సుగ్రీ—హనుమంతా! నీకతనమే మెల్లరముఁ గృతార్థులమైతిమి. విభీషణుఁడను నావనీ కర్ణధారత్వంబున మైరావణుఁడను ఘోరసముద్రమున నెట్టియాపదలు లేక సుఖముగా నీవలఁ బడవేసినది. ఇఁక రామలక్ష్మణులే విధంబున మేల్కాంతురు. ఆపాపియే మందులఁ జల్లినాఁడో? దాని ప్రతిక్రియ మన మెఱుంగముగదా?

రాము — దానికిమన విభీషణుఁడు లేఁడా?

సుగ్రీ — విభీషణా! త్వరగాఁ బ్రతిక్రియఁ జేసి రామలక్ష్మణుల బ్రతికింపుమా!

విభీ — ఎట్టిప్రయత్నములు నవలదు. భానురశ్మిసోకినంతనే వారు మేల్కాంతురు. అదుగో! సూర్యోదయము గానగుచున్నది. చూడుఁడు.

సీ॥ ప్రాగ్గిరిశాను శేఖాల • భాగంబునందున
బెట్టిన కుంకుమ • బొట్టనంగ
గగనేందిరారామ • కై చేసి తెచ్చిన
రతనాలుగూర్చిన • రాగిసీయన
ఉదయలక్ష్మికిమోద • మొనగూర్పఁగాఁ గాల
పురుషుఁడిచ్చిన జపా • పుష్పమనఁగ
లోకహితంబుగా • నాకాశవీధినిఁ
దెలివొందఁ బెట్టిన • దివ్వెయనఁగ
పద్మమిత్రుఁడు భూలోక • బంధువుండు
జారచోరుల పాలిటి • శత్రువుండు
పెనుసుషుప్తినిఁ బోకార్చు • ఘనచికిత్సుఁడు
తోఁచుచున్నాఁడు భానుండు • తూర్పుదిశను॥

రాము — (మేల్కాంచినట్టులలేచి కూర్చుండి) ఆహా! ఎంత గాఢనిద్రపట్టినది. లక్ష్మణా! నిద్ర దరిద్రదేవతకు నిలయమనియు సర్వకార్యభంగకారియనియుఁ దెలిసియుండియు రావణవధావిధానకార్య నిర్వాహకులము గావలసిన మనము నిట్టినిద్రకులోనై యుండుట సమంజసమే! సుగ్రీవా! ఈ రాత్రి రావణుని చర్యలు మనకేమియుఁ దెలియరావయ్యె. పాడునిద్ర నన్నావహించుటఁ జేసి లోకము నేనెఱుంగకుంటిని. మీరును మావలె నిద్రాదేవికి దాసులైతిరి!

సుగ్రీ — మహాశయా! దేవరవారికిఁ దెలియనిదొక్కటియు లేదు. గాని మావలన నేవినఁ గోరియున్నాఁగుచుండియుందురు. రాత్రిజరిగిన కార్యమతివిచిత్రము. మనచే దెబ్బఁదినిపోయిన లంకేశ్వరుఁడు విజయముపైనాశను వీడి, సిగ్గునువిడనాడి, తనసహపాఠియుఁ బాతాళలంకేశ్వరుండునగు మైరావణుని శరణుగోరనాతఁడు రామలక్ష్మణుల మాయోపాయంబునఁ గొనివచ్చి కాళికిబలిపెట్టెదనని శపథంబుఁ జేసినాఁడు

డాఁగివచ్చి మాకెఱింగించినంతకుముందే మీరు ఎదా

అదటు మీ కెఱిఁగించుటకు మీనిద్రాభంగము జేయనిచ్చగింపక హనుమం
తుండు వాలముచే నొకవింత ప్రాకారము నిర్మించి యందు మిమ్ము నిల్చి భద్రముతోఁ గా
పాడుచుంటిమి గాని పాపియగు మైరావణుండు మాయావిభీషణవేషధారుండై వచ్చి
మమ్ము మోసపుచ్చి మిమ్ముఁ గొనిపోయినాఁడు. మే మదియెఱింగి యావిభీషణుండే
కపటముగా మనకడఁ బ్రవర్తించుచు నిట్టిఘోరకార్యంబు నుజేసినాఁడని నిశ్చ
యించి వీనిఁ బెక్కుబాధలఁ గూలనాడ కడకు బంధించితిమి. పాపమాతఁడు మాయ
కుఁడని తెలియలేకఁబోయితిమి. కడకు నాతనిసాయముననే హనుమంతుఁడు పా
తాళలంక వేగి నా మైరావణు నివధించి మిమ్ము క్షేమముగాఁ దేఁగలిగినాఁడు. ఇప్పు
డే మీ రించుకవచ్చి మందుల మైకమును వీడి లేవఁగలిగితిరి,

రాము—ఔరా! ఎంత కార్యము జరిగినది! ఎంత విచిత్రము! హనుమంతా! కపులారా!
ఈ విభీషణుని గుణమరయలేక నెట్టులో జరిగిన ప్రమాదమునకతని వైఁగినియూటలో
మీరు పెద్దతప్పుఁ గావించినారు, అతనికి మాపణక్షమలు. కేసరిపుత్రా! నీయుపకా
రమును మే మెట్టులఁ దీర్చుకొనఁగలము.

హను—స్వామీ! మాటిమాటికి నన్నేల నుగ్గడించెదరు? దేనికైన మీకరుణయే ప్రధానము.

రాము—ఓయీ! అది నీయుత్తమగుణలక్షణము. సర్వదా నీసాయమే మాకు మేలొన
రించుచున్నది. అదుగో రణభేరీ మోగుచున్నది.

విభీ—రామచంద్రా! మైరావణుఁడు హనుమంతునిచేతఁ జచ్చినవార్తవిని రావ
ణుండు కడసారి కదనంబునకు బయలుదేరినాఁడు త్వరపడవలయు

రాము—హనుమంతా! నీ సేవకాభరమును నా పైమిగులఁ బెట్టుచుంటివి. నీ కేదికావల
యునో కోరుకొనుము

హను—మీకరుణయే నాకన్నిటికిఁ బ్రధానము. ఐనను నిట్లగుఁగాక!

గీ॥ సకలసౌఖ్యంబులొసఁగూర్చి • సకలగతుల
ధర్మపద్ధతిఁ దప్పక • ధరణిపతులు
ప్రజలఁ బాలించెదరుగాత! • వసుధలోన
యీతిబాధలు లేకుండ • నెగడుగాత!

ము—తథాస్తు. తథాస్తు. అట్లేయగుఁగాక.

మంగళం, శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ. శ్రీ.

సంపూర్ణము

